చందా వివరములు
ఆంధ్ర దినపత్రిక

| | రూ. | [నయా పైసలు] |
|---|---|---|
| (ఆదివారపు సంచికతోసహా) | | |
| సంవత్సర చందా ... | 28 | 00 |
| అర్ధ సంవత్సర చందా ... | 14 | 00 |
| 3 మాసముల చందా ... | 7 | 00 |
| నెల చందా ... | 2 | 50 |
| విడిప్రతిసాధారణదినములలో ... | | 7 |
| ఆదివారపు దినపత్రిక ... | | 18 |

ఆంధ్ర పత్రిక — మద్రాసు-1.

# ఆంధ్రపత్రిక

319523

చందా వివరములు
బుధవారపు సచిత్ర వారపత్రిక

| | రూ. | [నయాపైసలు] |
|---|---|---|
| సంవత్సర చందా ... | 18 | 00 |
| అర్ధ సంవత్సర చందా ... | 6 | 50 |
| విడి ప్రతి ... | | 25 |
| భారతి (సచిత్ర మాసపత్రిక) | | |
| సంవత్సర చందా ... | 12 | 00 |
| అర్ధ సంవత్సర చందా ... | 6 | 00 |
| విడి ప్రతి ... | 1 | 00 |

ఆంధ్ర పత్రిక — మద్రాసు-1.

The Andhra Patrika - Madras సంపుటం 44. సంచిక 97 FOUNDER: DESODHARAKA K. NAGESWARA RAO సోమవారం 8-7-1957 Reg. No. M. 1118 4 పేజీలు 7 నయాపైసలు

# పొదుపుచేసి సిబ్బంది జీతాలను పెంచండి

## ఆంధ్రప్రభుత్వానికి శాసనసభ్యుల సలహా

### ఖర్చుల సరళి విచారణకు ఒక సంఘాన్ని వేయాలని సూచన

హైదరాబాదు, జులై 7: ఆర్థికమంత్రి శ్రీ గోపాలరెడ్డి ప్రభుత్వ ఖర్చుల్లో పొదుపుమార్గాలు సూచించనందుకు, యివాళ చర్చ సందర్భంలో ప్రతిపక్ష సభ్యులేగాక కాంగ్రెసు సభ్యులుకూడా విమర్శించారు. ఆదాయంపెంచుకొని ఖర్చులు తగ్గించుకొన్న నాన్‌గెజిటెడ్ ఉద్యోగులకు, గ్రామాధికార్లకు జీతాలు పెంచడం అవసరమని హెచ్చరించారు. ఆదాయం పెంచుకోడానికి కొన్ని మార్గాలు సూచించారు. భూమి సంస్కరణలను వెంటనే అమలు జరపాలని అర్థించారు.

ప్రతిపక్ష సభ్యుడు (కమ్యూనిస్టు) శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు మాట్లాడుతూ, ప్రభుత్వోద్యోగులు తృప్తిగా ఉన్నట్లయితే, సామర్థ్యం పెరిగి పరిపాలన [illegible]మౌతుందని, బడ్జెట్ అంచనాలను చూస్తే నాన్ గజెటెడ్ ఉద్యోగులకుగాని, గ్రామాధికారులకు గాని, అటువంటి సంతృప్తి యేర్పడే ఆశ ఏమీ కన్పడడం లేదని అన్నారు.

ఆంధ్ర తెలంగాణ ప్రాంతాలలోని ఉద్యోగులకు, ఒకేరకం వేతనాల ప్రమాణాన్ని నిర్ణయించడానికి ప్రభుత్వం యేమీ చేయలేదని, యిందువల్ల ఉద్యోగులలో అసంతృప్తి పెరిగిందని ఆయన విమర్శించారు. మద్రాసు మైసూరు కేరళ రాష్ట్రాల ఆయవ్యయాల స్థితి, మనకన్నా ఏమీ మెరుగుగా లేదు. అయినా అక్కడ తక్కువ జీతాల ఉద్యోగులకు, ఉపాధ్యాయులకు, గ్రామాధికారులకు జీతాలు పెంచారు గదా! అని శ్రీ వెంకటేశ్వర్లు అన్నారు.

### మంత్రుల జీతాలు

"మంత్రులు తమ జీతాలను నూటికి 10 వంతులు తగ్గించుకోవాలి. అంతేగాదు, జీతాలు లేకుండా పనిచేయగలవారు, అసలు జీతాలు పుచ్చుకోకుండానే ఉండాలని నా సలహా. ఆర్థికమంత్రి, తమ బడ్జెట్ ప్రసంగంలో ఖర్చుల పొదుపుకు యేయే మార్గాలు అనుసరించదలచిందీ చెప్పి ఉంటే బాగుండేది."

"ఆంధ్రప్రదేశ్‌లో ఇటీవలి సంవత్సరాలలో పన్ను నూటికి 62 వంతులు పెరిగింది. కాని తల 1కి సగటు ఆదాయం మాత్రం అందుకు తగ్గట్టు పెరగలేదు. ప్రభుత్వ పన్నుల విధానం ధనికులకు మినహాయించేట్లుంది" అని ఆయన విమర్శించారు.

### రాబడి పెంచేమార్గాలు

మాంగనీస్ మీద ఇనుము, మైకాల మీద సరుకాసా (రాయల్టీ) పెంచి, ఆ విధంగా ప్రభుత్వ రాబడి ఎక్కువచేసుకోవచ్చునని శ్రీ వెంకటేశ్వర్లు సూచించారు.

భూమి సంస్కరణలను ప్రవేశపెట్టి భూమిశిస్తు-ధనికులపై ఎక్కువగా పేదలపై తక్కువగా పడేట్లు-విధానాన్ని శాస్త్రీయ పద్ధతిలో సంస్కరించాలని ఆయన కోరారు. ప్రభుత్వం సాగించే నిర్మాణాలను కంట్రాక్టర్లకు ఇవ్వక తమ శాఖద్వారానే జరిపించి, ఖర్చు కలిసివచ్చేట్లుగా చూడాలని సూచించారు.

"ఆయవ్యయాలలో, యిలాగే లోటు ఉంటూంటే, రిజర్వుబ్యాంకు తమ బిల్లులను తిరస్కరించవచ్చని ప్రభుత్వం అంటున్నది. ఇదేమిటో నాకు బోధపడడంలేదు. మిగతా రాష్ట్రాల ఆయవ్యయాలలోకూడా యిలాగే లోటుఉన్నదిగదా" అన్నారు.

ప్రాజెక్టులకు ఇచ్చిన అప్పులపై-ఆ ప్రాజెక్టుల ఫలసాయం చేతికి అందకముందే, వడ్డీ చెల్లిస్తుండడం ఏమీ బాగుండలేదని విమర్శించారు. నిజాంకు భరణం, జాగీర్దార్లకు జమీందార్లకు పరిహారం చెల్లించడం నిలిపివేయాలని శ్రీ వెంకటేశ్వర్లు సూచించారు.

### ఎక్కువ పొదుపుఅవసరం

శ్రీ గోపాలరావు ఎక్బోటే (కాం) మాట్లాడుతూ, కేంద్ర ప్రభుత్వం పొదుపుకోసం గట్టిగా కృషి ప్రారంభించిన యీ సమయంలోనైనా, ఆర్థికమంత్రి పొదుపుకు మార్గాలు సూచించకపోవడం విచారం కలిగించిందన్నారు. భూసంస్కరణ[illegible] పెట్టాలని [illegible] చేయాలని, పరిశ్రమలను అభివృద్ధి పరచాలని, ప్రజలు ఆందోళన చేస్తుంటే, వాటి విషయంగాని, ఎన్. జీ. ఓ. ల జీతాలు పెంచే సంగతిగాని, ఆర్థికమంత్రి తమ ప్రసంగంలో ప్రస్తావించకపోవడం శోచనీయమని శ్రీ ఎక్బోటే అన్నారు.

మంత్రులు జీతాలు నూటికి 10 వంతులు తగ్గించుకొన్నంత మాత్రాన చాలదని, ఇతరమైన చర్యలుకూడా తీసుకోకపోతే, ఖర్చుల్లో పెద్ద కలిసివచ్చేదేమీ ఉండదని ఆయన అన్నారు.

రాష్ట్ర ఆర్థికపరిస్థితి యేమంత సంతృప్తిగా లేదని ఆర్థికమంత్రి చెప్పారు. కాని, అసంతృప్తికరమైన ఆ పరిస్థితి మెరుగుపరచడానికి, నిర్దుష్టమైన సూచనలేమీ ఆయన చేయలేదు అన్నారు శ్రీ ఎక్బోటే.

### తెలంగాణా ఆర్థికస్థితి అంత చెడుగాలేదు

"తెలంగాణ ఆర్థికస్థితి చెబుతున్నంత చెడుగాలేదు. కడచిన కొద్ది సంవత్సరాలకు యీ ప్రాంతం ఆయవ్యయాలు తేల్చడానికి అనుసరించిన పద్ధతి సరియైందికాదు. (ఉమ్మడి హైదరాబాదు రాష్ట్రం విభజనప్పుడు మూడు ప్రాంతాలకు ఆస్తి అప్పుల కేటాయింపులో ఏ పద్ధతి అనుసరించారో, తెలంగాణ ఆయవ్యయాలు తేల్చడానికి అదేపద్ధతి అనుసరించారు. తెలంగాణాకు 60% కర్ణాటకానికి 25% మరాట్వాడాకు 15% చొప్పున విభజించారు) 1954-55లో గాని 55-56లో గాని ఉమ్మడి హైదరాబాదు ఆయవ్యయాలలో తెలంగాణ వంతు నూటికి 60 వంతులు కేటాయించడం సరిగాలేదు. ఈ దామాషాను అనుసరిస్తే, తెలంగాణ ఆర్థికస్థితి సరిగా లేదు. కొంచెం జాగ్రత్తగా పరిశీలించినట్లయితే, తెలంగాణఆయవ్యయాలలో లోటు ఉన్నా, జరుగుబాటుస్థితి బాగానే ఉందని, నిజానికి ఆంధ్రప్రాంతం కంటె మెరుగేనని తేలుతుంది" అని శ్రీ ఎక్బోటే వివరించారు.

### ఋణపత్రాలు విక్రయం తగదు

ఆంధ్ర ప్రాంతం కోసమని రిజర్వుబ్యాంకు వద్ద అతిగా తీసుకొన్న (ఓవర్ డ్రాఫ్ట్) చెబదుళ్లను తీర్చనిమిత్తం, రిజర్వుబ్యాంకులో తెలంగాణాకు ఉన్న రు 11కోట్ల విలువగల భారత ప్రభుత్వ ఋణపత్రాలను అమ్మివేయడం తగదు. వాటిని తెలంగాణా ప్రజల అభ్యున్నతికే వినియోగించాలి" అని శ్రీ ఎక్బోటే సూచించారు.

అలా చేసినట్లయితే ఆంధ్రప్రాంతానికి తెలంగాణా ఋణదాత అవుతుంది గదా అని ఆర్థికమంత్రి శ్రీ గోపాలరెడ్డి అన్నారు.

శ్రీ వాసుదేవనాయక్ (కాం. తెలంగాణ) యీ విషయాన్ని ముందేర్పడబోయే ప్రాంతీయ సంఘానికి నివేదించిచే మంచిదని సూచించారు. శ్రీ ఎక్బోటే తమ ప్రసంగాన్ని కొనసాగిస్తూ యిలా అన్నారు.

"రాష్ట్రమంతటికి వర్తించేట్లు సమగ్రమైన భూమి సంస్కరణల బిల్లును తీసుకొని రావాలి. ప్రజలు కోరితే తెలంగాణాలోకూడా మద్యనిషేధం ఎత్తేశామని ముఖ్యమంత్రి అన్నట్లు విన్నాను. ఇది సరియైన పద్ధతి గాదు. మద్యనిషేధం అమలు జరపాలని కాంగ్రెసు ప్రభుత్వాలు నిర[illegible]

(8-వ పుట చూడండి)

## కీలకస్థానాలు ఆక్రమించాలని మాలెంకోవ్ వర్గం పన్నుగడ

### పార్టీ రాజకీయ పంథా మార్చాలని ప్రయత్నించినట్లు కృశ్చేవ్ ఆరోపణ

లండన్, జులై 6: సోవియట్ యూనియన్ ప్రభుత్వంలోనూ, కమ్యూనిస్టు పార్టీలోనూ కీలకస్థానాలను ఆక్రమించి, కమ్యూనిస్టుపార్టీ రాజకీయ పంథాను మార్చివెయ్యాలని శ్రీ జార్జి మాలెంకోవ్, శ్రీ వ్యాచెస్లావ్ మాలటోవ్, శ్రీ లాజార్ కగనోవిచ్ "పిరికి పన్నుగడ" ఒకటి పన్నారని, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శి శ్రీ నికితా కృశ్చేవ్ ఆరోపించారు.

20వ పార్టీ కాంగ్రెస్ నిర్ణయాలను ప్రతిఘటించిన వారి బలాన్ని ఇప్పుడు పూర్తిగా తొలగించివేశారని శ్రీ కృశ్చేవ్ చెప్పారు.

లెనిన్‌గ్రాడ్ నగర స్థాపన 250వ వార్షికోత్సవం సందర్భంలో, ప్రధాని శ్రీ బుల్గానిన్‌తో కలిసి ఈనగరానికి వచ్చిన శ్రీ కృశ్చేవ్ ఒక కార్మికుల సభలో ప్రసంగిస్తూ, మాలటోవ్-మాలెంకోవ్ నాయకవర్గాన్ని పార్టీ నుంచీ ప్రభుత్వం నుంచీ తొలగించడానికి గల కారణాలను వివరించారు.

ఇదివరలో లెనిన్‌గ్రాడ్ వ్యవహారానికి శ్రీ మాలెంకోవ్ బాధ్యులని శ్రీ కృశ్చేవ్ ఆరోపించారు. అందువల్లనే శ్రీ మాలెంకోవ్ హడలిపోయి లెనిన్‌గ్రాడ్ నగర వార్షికోత్సవాలకు రాలేదన్నారు.

పార్టీ వ్యతిరేక వర్గాన్ని బయటపెట్టడంవల్ల, ఇంక 20వ పార్టీ కాంగ్రెస్ నిర్ణయాలకు జీవంపోసినట్లవుతుందన్నారు.

సోవియట్ యూనియన్‌లోని ప్రాంతీయ ప్రభుత్వాలైన రిపబ్లిక్‌లకు ఆర్థిక సాంస్కృతిక నిర్మాణ కార్యక్రమాల విషయంలోనూ, శాసన నిర్మాణంలోనూ అధికారాలు పెంచాలనే నిర్ణయాన్ని మాలెంకోవ్ మాలటోవ్ వర్గం ప్రతిఘటించింది.

పారిశ్రామిక యాజమాన్య సంస్కరణలను అమలు జరపడానికి ఈ వర్గం ఇష్టపడలేదు.

పాలు, వెన్న, మాంసం అమెరికాలో తల ఒక్కంటికి ఎంత ఉత్పత్తి అవుతున్నదో, రష్యాలోకూడా కొన్ని ఏళ్లలో అదే ప్రమాణంలో ఉత్పత్తి సాధించాలని ఉద్యమం ప్రారంభించాలనుకుంటే, ఈ పార్టీ వ్యతిరేకవర్గం ప్రతిఘటించింది.

దేశంలో ప్రజల జీవిత ప్రోత్సాహానికి, వాస్తవ స్థితిగతులకు దూరమైపోయిన ఈ వర్గం, సోవియట్ ప్రజల జీవన సదుపాయాలు బాగుపరిచే ముఖ్య నిర్ణయాలను ప్రతిఘటించింది.

విదేశాంగ వ్యవహారాల విషయంలో, అంతర్జాతీయ వైషమ్యాలను నివారించి శాంతిని సుస్థిరపరిచే చర్యలను ఈ పార్టీ వ్యతిరేకవర్గం ముఖ్యంగా శ్రీ మాలటోవ్ ప్రతిఘటించారు.

సామ్యవాద, ధనికవాద రాజ్యాల మధ్య సహజీవనం అనే లెనినిస్టు సిద్ధాంతానికి విరుద్ధంగా వ్యవహరించారు. నూతన పరిస్థితులను గ్రహించేశానికి వీరు నిరాకరించారు.

ఆంతరంగిక వ్యవహారాలలోనూ, అంతర్జాతీయ వ్యవహారాలలోనూ, మార్క్సిజం-లెనినిజం గురించి జీవం లేని గ్రంథస్థ విజ్ఞానానికి లోబడి వ్యవహరించారు. తమ తప్పుమాటలకు చర్యలకు కేంద్ర సంఘంలోనూ, అధ్యక్షమండలిలోనూ చెల్లుబడిలేదని గ్రహించినప్పుడూ రహస్యంగా తమలో తాము ఒక ఒప్పందం కుదుర్చుకుని పార్టీలో కక్షలు సృష్టించి గర్హనీయమైన పంథా అనుసరించ నారంభించారు.

ఈ పార్టీ వ్యతిరేకవర్గంలో కల్లా సిగ్గు విడిచినవాడు పూర్వ విదేశాంగమంత్రి దిమిత్రీ షెపిలోవ్.

పార్టీ కేంద్ర సంఘంపై వారివిమర్శకు దాడికి, లెనిన్‌గ్రాడ్ నగర వార్షికోత్సవం తరుణం చూసుకున్నారు.

పార్టీ అధ్యక్షమండలిలో లెనిన్‌గ్రాడ్ సందర్శన విషయంపై చర్చ అవకాశంగా తీసుకుని వారు సమిష్టి [illegible] ఇలా ఎందుకు జరిగిందంటే, యీ[illegible] వరలో లెనిన్‌గ్రాడ్ వ్యవహారానికి బాధ్యుడైన మాలెంకోవ్ యీ నగరం రావడానికి హడలిపోయారు.

పార్టీవిధానం అందరికీ స్పష్టమే. లెనిన్ మహత్తర సిద్ధాంతాల అడుగుజాడల్లో 20-వ పార్టీ కాంగ్రెస్ నిర్ణయించిన కార్యవిధానం ప్రకారం పార్టీ కృషిచేస్తుంది.

దేశంలో ప్రజావసరవస్తు సమృద్ధికి ప్రజల జీవనప్రమాణ వృద్ధికీ పార్టీ స్థిర సంకల్పంతో కృషిచేస్తుంది. గృహావసతి బాగా వృద్ధిచెయ్యడానికి కృషి చేస్తుంది.

విదేశాంగవిధానంలో రాజ్యాలమధ్య శాంతియుత సహజీవనానికీ, సామ్యవాద రాజ్యవర్గ బలాభివృద్ధికీ కృషి చేస్తుంది.

నిరాయుధీకరణ, అణ్వస్త్రాల నిషేధం ఇవి ఈనాటి అతిప్రధాన అంతర్జాతీయ సమస్యలు. కొన్ని సామ్రాజ్యవాద రాజ్యాలు బలం చూపి రాయబారం జరిపే ధోరణితోనూ, కార్మికవర్గాలకు మోయలేని భారంగా పరిణమిస్తున్న ఆయుధ నిర్మాణపు పోటీతోనూ చెరలాటలాడుతున్నాయి. శాంతి స్థాపన కృషిని విఫలం చేస్తున్న వారినీ సైనిక నిర్మాణం ద్వారా అపార లాభాల ప్రచ్ఛన్న సంఘర్షణ సాగిస్తున్న వారినీ రష్యా బయటపెట్టుతుంది. నిరాయుధీకరణ, అణ్వస్త్ర నిషేధం సాధించడానికి రష్యా కృషిచేస్తుంది.

దేశమంతటా ప్రజలు కేంద్ర కమ్యూనిస్టు సంఘాన్నీ సోవియట్ ప్రభుత్వాన్నీ బలపరుస్తోంది. ప్రజలూ పార్టీ అపూర్వ ఐక్యభావం చూపుతున్నారు. ఇంక ఈ పార్టీని లెనినిస్టు పంథానుంచి ఎవ్వరూ తప్పించలేరు.

(ప్రజలకు పాలు, వెన్న, మాంసం

(3 వ పుట చూడుడు)

## భారత అభివృద్ధి కార్యక్రమ ఆదర్శం

### నెహ్రూ వాదాన్ని ప్రజాస్వామిక ప్రపంచం గుర్తించాలని విజ్ఞాపన

లండన్, జులై 7: 'భారతదేశంలోను, చైనాలోను, రైతుజనోద్ధరణంకోసం మహాకృషి సాగుతోంది. చైనా కమ్యూనిస్టు మార్గాలను అనుసరిస్తోంది. భారత దేశం ప్రజాస్వామ్య మార్గాలను అనుసరిస్తోంది. ఇందులో చైనా నెగ్గి, భారతదేశం నెగ్గనిపక్షంలో, ఆసియాలో ప్రజాస్వామ్యం దెబ్బతినిపోతుంది. అప్పుడు అది ఒక్క భారతదేశానికే ముప్పు కాదు. సకల ప్రపంచానికి ముప్పే. శ్రీ నెహ్రూ ఇది గ్రహించారు. మనంగూడా దాన్ని గ్రహించాలి. అంటూ సండే పిక్టోరియన్ అనే బ్రిటిష్ పత్రికను, శ్రీ నెహ్రూనుగూడా ఒక పుట నిండేట్లు ప్రకటించిన వ్యాసంలో విశదంచేసింది.

ఈ పత్రిక రాజకీయ విలేఖరి శ్రీ సిడ్నీ జాకబ్‌సన్ నిన్న శ్రీ నెహ్రూతో ఒకగంటసేపు మాట్లాడారు. ఆ అనంతరం ఈ వ్యాసాన్ని వ్రాశారు. ఇందులో శ్రీ జాకబ్‌సన్ శ్రీ నెహ్రూ కామన్‌వెల్తు రాజకీయవేత్తల్లో జటిలుడని, వివాదాస్పదమైన వ్యక్తి అని వర్ణించారు.

శ్రీ నెహ్రూతో తాను మాట్లాడుతూవుండగా, భారతదేశంలో గ్రామాలు, గ్రామాల అభివృద్ధికోసం జరుగుతున్న పనులను గూర్చిన మాటలు వచ్చినప్పుడు, ఆయనలో కన్పించిన ఉషారు, ఉత్సాహం, అమేయంగా వున్నా[illegible] ప్రకటించారని శ్రీ జాకబ్‌సన్ వ్రాశారు.

"యువకులయిన భారతీయులు సైకిళ్లమీదపోయి, గ్రామాల్లో తిరుగుతూ నూతన భావాలను, నూతన ఉత్సాహాన్ని వివిధంగా గ్రామాల్లోకి ఎక్కిస్తున్నదీ చెబుతున్నప్పుడు శ్రీ నెహ్రూ ఉత్సాహమే మూర్తిఅయినట్లు తోచారు. అప్పుడే [illegible]న్ని నేనుదర్శించగల్గాను. పంచవర్ష ప్రణాళిక భారతదేశానికి ఎంత అవసరమో, ఎట్లా అవసరమో శ్రీ నెహ్రూ నాకు వివరించి చెప్పారు. కొత్త పరిశ్రమలను గురించి మాట్లాడారు. రవాణా సౌకర్యాల అభివృద్ధిని గురించి చెప్పారు. నిరుద్యోగా

(3 వ పుట చూడుడు)

## ఉద్యోగులపై కాంగ్రెసువారుచేసే ఆరోపణలకు పద్ధతి ఉండాలి

లక్నో, జులై 6: ఉద్యోగులపై కాంగ్రెసువారు వ్యక్తిగతంగా ఆరోపణలు చేసేవిషయమై ఒక పద్ధతిని నిర్ణయిస్తామనీ, దానిప్రకారమే కాంగ్రెసువాదులు వ్యవహరించాలనీ కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ ఢేబర్ పత్రికా ప్రతినిధులతో అన్నారు. అధికారుల లంచగొండితనం వివరించే విషయమై కూడా తాము వివరంగా కొన్ని సూచనలు చేస్తామన్నారు. ప్రజలకు సంబంధించిన విషయాలను, జిల్లాకాంగ్రెసు, లేదా ప్రదేశ్ కాంగ్రెసు సంఘాలు పూర్తిగా పరిశీలించి, అధికారుల దృష్టికి తీసికొనిరావాలనీ, అవసరమైతే బహిరంగసభలు జరపవచ్చుననీ, కాని ఈ విధానం అంతా నిర్మాణాత్మకంగా మాత్రం ఉండాలనీ అన్నారు.

అటు ప్రభుత్వంలోను, ఇటు పార్టీలోను నీతి, నిజాయితీలు ముఖ్యం అన్నారు. కేవలం ప్రజల కష్టాలను గురించి విలపిస్తూ ఉంటే పార్టీకి భవిష్యత్తు లేదు. పైగా ప్రభుత్వంలో ఉన్న పార్టీయే ఇలాచేస్తే, దాని మనుగడకే ప్రమాదం ఉంది. ఒక విధానాన్ని ఆచరణలోనికి తీసికొని రావాలన్నది కాంగ్రెసు లక్ష్యం. అందువల్ల ప్రభుత్వమూ, పార్టీ కలిసి కట్టుగా పని చేయాలి. ప్రజలకు ప్రణాళికాది సమస్త విషయాలను గురించి వివరించాలి. ప్రజల తోడ్పాటుతో పార్టీ, ప్రభుత్వమూ ముందంజ వేయాలి. ఈ ఉభయ వర్గాలు నీతి నిజాయితీలతో వ్యవహరించాలి. [illegible]

# అమెరికా ఆర్థిక సహాయం దురాక్రమణే

## భారత విధానాలే బాగున్నాయని కెనడా ప్రధాని ఆశ్చర్యకర ప్రకటన

లండన్, జులై 6: ఇతర దేశాలమీద అమెరికా ఆర్థిక దండయాత్రనుగురించి, ఆధిపత్యాన్ని, అదుపును గురించి, కామన్‌వెల్తు ప్రధానుల సభలో కెనడా ప్రధాన మంత్రి ఖండితంగా మాట్లాడ్డం, ఈ సభకు వచ్చిన తక్కిన కామన్‌వెల్తు దేశాలలో ప్రధానులకేగాక, ఆ మాటలను విన్న అందరికీ కనువిప్పును కల్గించింది. అందర్నీ ఆశ్చర్యంతో ముక్కుమీద వేలు వేసుకునేట్లు చేసింది.

కెనడా ప్రధాని కామన్‌వెల్తు ప్రధానుల ఈ సభలో, తమ దేశం ఆర్థిక వ్యవస్థమీద అమెరికా ఆధిపత్యం ఎంతగా వున్నదో వివరించి, ఇప్పుడు ఇక ఇది రాజకీయ ఆధిపత్యానికి కూడా దారితీయగల స్థితిలో వున్నదని అన్నారు. కెనడా మీద అమెరికా వారి ఈ ఆర్థిక దండయాత్రను ఖండించారు.

ఈ మాటలు విన్న అనంతరం, ఆసియా దేశాలకు సంబంధించిన ఒకరు ఈలా అన్నారు: "ఇదే మాటను, ఏ ఆసియా దేశం అన్నా, అమెరికాకు వ్యతిరేకంగా ఆ దేశం దుర్మార్గమైన ప్రచారాన్ని సాగిస్తున్నట్లు, పెద్ద గోల బయలుదేరివుండేది. అందరు ప్రబుద్ధులూ ఆ ఆసియా దేశాన్ని ఖండించివుండేవాళ్లు. కాని, ఆ మాటలు కెనడా ప్రధాని అయిన శ్రీ డీఫెన్ బేకర్ నోట వెంట వచ్చాయి. కామన్‌వెల్తు సమావేశానికి వచ్చిన ప్రాశ్చాత్య రాజ్యాలలోని ప్రతినిధులు, ఆ మాటలను ఖండించలేదు సరికదా, సానుభూతిని గూడా చూపించారు."

ఇప్పుడు ఇక్కడ అంతా విదేశీ పెట్టుబడులపట్ల, సహాయాలపట్ల, భారతదేశం అనుసరిస్తున్న విధానాన్ని మెచ్చుకుంటున్నారు. కామన్‌వెల్తు సమావేశంలోనే, ఇందుకు, అంతా శ్రీ నెహ్రూను అభినందించారు. తన దేశం మీద విదేశీ పెట్టుబడిదార్లకు అధికారం, ఆధిపత్యం చిక్కకుండా, తాను అధికారంలోకి వచ్చిన దగ్గర నుంచీ, శ్రీ నెహ్రూ రక్షించుకుంటూవస్తున్నందుకు, ఆయన్ను అంతా అభినందించారు.

కెనడా ప్రధాని, అమెరికా వ్యవహారాన్ని, కామన్‌వెల్తు సభలో ఖండించడంతో ఆగలేదు. నేడు కెనడా చేరుకున్న అనంతరం, అమెరికా ఏ విధంగా అంతర్జాతీయ వాణిజ్య, సుంకాల ఒప్పందాన్ని ఏ విధంగా భంగిస్తూ, పనిచేస్తున్నదీ బయట పెట్టారు. ఒప్పందంలో వుండి గూడా, దాన్ని త్రోసివేసి, ఏ విధంగా గోధుమలను వాటిని, తక్కువ ధరలకు అమ్మి అందులోని తక్కిన దేశాలకాళ్లక్రింద గోతులు తీస్తున్నది, శ్రీ డీఫెన్ బేకర్ వివరించారు. అమెరికా, అంతర్జాతీయ వాణిజ్య సుంకం, సమాధానానికి విరుద్ధంగా వ్యవహరిస్తున్నది అన్నారు. ఈ విషయమై అమెరికాకు తాము అధిక్షేపణ తెలిపేది, లేనిదీ, ఇంకా నిర్ణయించుకోలేదన్నారు.

కెనడా దగ్గర గూడా గోధుమల నిల్వలు చాలా వున్నాయి. వీటిని, డాలర్లకుఇస్తే, అమ్మతామన్న పద్ధతిని పద్ధతినుంచి తప్పించడాన్ని గూర్చి ఆలోచించవలసివుంది. ఈ విషయం, త్వరలోనే జరుగనున్న కామన్‌వెల్తు ఆర్థిక, వాణిజ్య సమావేశంలో ఆలోచిస్తారు అని గూడా ఆయన చెప్పారు.

శ్రీ డీఫెన్ బేకర్ ఇవ్వాళ్ళనే కెనడా చేరుకున్నారు. అక్కడ పత్రికా విలేఖరులతో మాట్లాడుతూ, కామన్‌వెల్తు ప్రధాన మంత్రుల సభ చాలా బాగా జరిగింది అన్నారు.

### బ్రిటిష్ సైనిక నౌకలచే సూయజ్ వినియోగం

లండన్, జులై 6: బ్రిటిషు సైనిక నౌకలు త్వరలోనే మళ్ళీ సూయజ్ కాల్వగుండా ప్రయాణాలు మొదలు పెడతాయి. ఈజిప్టుపై బ్రిటన్, ఫ్రాన్స్ ఇస్రేల్‌లు దురాక్రమణ జరిపినది మొదలు యీ ప్రయాణాలు బందైనాయి.

## అల్జీరియాలో ఫ్రెంచి విధానం

### అంతర్జాతీయ స్వతంత్ర కార్మిక సభలో ఖండన

ట్యూనిస్, జులై 6: అల్జీరియాలో ఫ్రెంచివారు అనుసరిస్తున్న పనికిమాలిన విధానాన్ని అంతర్జాతీయ స్వతంత్ర కార్మిక సంఘాల సమాఖ్య సభలో బెల్జియం ప్రతినిధి శ్రీ ఓమర్ బెకు ఖండించారు.

అల్జీరియాలో ఈ పోరాటం ఆగిపోవాలి. అల్జీరియన్లు స్వాతంత్ర్యాన్ని ఫ్రాన్సు గుర్తించాలి. ఆ దేశంలో అన్ని జాతుల ప్రజలకు సమాన హక్కులు వుండే పద్ధతిని రాజ్యాంగాన్ని సిద్ధం చేసి, దాని ప్రకారం అల్జీరియాకు స్వయంపాలనాన్ని ఇచ్చివెయ్యాలి. అని ఆయన అన్నారు.

ఈ సభకు 1500 మంది ప్రతినిధులు, పరిశీలకులు, ప్రపంచంలో 88 దేశాల నుంచి వచ్చారు.

### రివరెండ్‌స్కాట్‌కు నెహ్రూ దర్శనం

లండన్, జులై 6: రెవరెండు మైఖేల్‌స్కాట్ నేడు ప్రధానమంత్రిని చూచారు. ఇస్రాయెల్ రాయబారి శ్రీ ఎలియాహూ ఏలాత్ గూడా శ్రీ నెహ్రూను దర్శించారు.

శ్రీ నెహ్రూ ఇవాళ లండన్ నుంచి మౌంట్‌బాటన్ ఇంటికి బయలుదేరి వెడుతున్నారు. ఈ ఇల్లు బ్రాడ్‌లాండ్స్‌లో వుంది. అక్కడ ఈ వారాంతందాకా వుండి, అనంతరం పోలండుకు బయలుదేరి పోతారు.

## టెండరు నోటీసు

శ్రీకాకుళంజిల్లా బోర్డుకు కావలసిన అచ్చుపనులు చేయుటకై 19-7-57 సాయంకాలము 4 గంటలవరకు సీలు వేయబడిన టెండర్లు శ్రీకాకుళం జిల్లా బోర్డు స్పెషల్ ఆఫీసరుకు చేరునట్లు స్వయముగా గాని పోస్టుద్వారా గాని పంపుకొనవచ్చును. ఆ తేదీనే 4-30 గంటలకు బోర్డు ఆఫీసులో టెండర్లు తెరువబడును. టెండరు ధరావత్తు రూ. 50-0-0.

టెండరు షరతులు, టెండరు దరఖాస్తు కావలసినవారు జిల్లా బోర్డు స్పెషల్ ఆఫీసరువారికి రూ. 2/- లు చెల్లించి దరఖాస్తు పంపుకొనినచో, పంపబడును.

కె. నరసింహారాజు,
శ్రీకాకుళంజిల్లాబోర్డు,
స్పెషల్ ఆఫీసరుకుగాను.
శ్రీకాకుళం, 29-6-57.

## వి. ఆర్. ఎస్. కాలేజి
చీరాల, గుంటూరుజిల్లా.

శ్రీ యూనివర్సిటీ కోర్సులలో ఖాళీ సీట్లున్నవి. ఇందులో చేరగోరు విద్యార్థులు యీ క్రింది ఎ. బి. గ్రూపులలో ఒక దానినుండి రెండు సబ్జక్టున్ను మరొక దానినుండి ఒక సబ్జక్టున్ను ఎన్నుకొనవచ్చును.

ఎ. (1) లెక్కలు (2) ఫిజికల్ సైన్సులు (ఫిజిక్సు, కెమిస్ట్రీ) (3) బయలాజికల్ సైన్సులు (బాటనీ, జూఆలజీ.)

బి. (1) ఇండియన్ హిస్టరీ, సివిక్సు ఇండియన్ అడ్మినిస్ట్రేషన్ (2) ఎకనమిక్సు,జాగ్రఫీ (3) అకౌంట్సు, కమర్షియల్ నాలెడ్జి (4) లాజిక్.

చీరాల } డా॥ టి. రామారావు.
5-7-57 } ఎం. ఎ., పిహెచ్. డి.,
ప్రిన్సిపాలు.

## నాగార్జునసాగర్ డామ్
సవరణ

ఆంధ్రపత్రికలో జూలై 3, 5 తేదీలలో ప్రకటింపబడిన "నాగార్జునసాగర్ డాం కుడిప్రక్క కట్టుమీద అనుపత్రి కట్టుటకై" ప్రకటించిన టెండరు నోటీసులో యీ క్రింది సవరణలుగమనించేది.

1. టెండరు దాఖలు చేయబడుటకు ఆఖరు తేదీ 22-7-57 మ ధ్యాహ్నం 3 గం॥లకు 24-7-57 మధ్యాహ్నం 3 గం॥ లుగాను.

2. టెండరు పరిశీలించుకాలము : 22-7-57 సా॥ 4 గం॥ లను, 24-7-57 సా॥ 4 గంటలుగాను.

3. కంట్రాక్టు ఫారము: K-2, లంప్ సమ్ అనియు. ఎ. వి. రాఘవరాజు.
ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు.
రైట్ బ్యాంకు క్యాంపు డివిజన్.
నాగార్జునసాగర్ డామ్.

## కావలెను

తూర్పు గోదావరిజిల్లా-పెద్దాపురము తాలూకా, ఆరెంపూడి అన్నవరము - (వయా - తుని) శ్రీ వీరవెంకట సత్యనారాయణస్వామివారి దేవస్థానము - ఓరియంటల్ మిడిల్ స్కూలులో ఈ దిగువ చెప్పబడిన పదవుల నిమిత్తము దరఖాస్తులు, వారి యోగ్యతలు, వయస్సు, అనుభవము వగైరా వివరములతో ది 15-7-1957 వ తేదీలోగా, ఈ దిగువ సంతకముచేసినవార్కి చేరునట్లుగా పంపుకోవలెను. శ్రీ గవర్నమెంటువారి మిడిల్ స్కూల్లలో ఈయబడుచున్న జీతముల స్కేల్సు ప్రకారము జీతము లీయ్యబడును.

1. ప్రధానోపాధ్యాయుడు-బి. ఇడి.
2. సంస్కృత పండితుడు - విద్యాప్రవీణ లేక సాహిత్య శిరోమణి.
3. క్వాలిఫైడ్ డ్రిల్లుమాష్టరు-కమ్-ఆఫీసు గుమాస్తా.

(సం) డి. భాస్కరరావు,
మేనేజరు & కరస్పాండెంటు.
అన్నవరము, వయా-తుని, (తూ॥ గో.)

## ఇరాన్‌లో భూకంపం
### 2వేల మంది మృతి

టెహరాన్, జూలై 6: ఇరాన్ ఉత్తర ప్రాంతంలో క్రితం సోమవారం జాడు వచ్చిన భూకంపంలో 2 వేల మంది మరణించినట్లు పత్రికా వార్తలు తెలుపుతున్నాయి.

నిన్న రాత్రికూడా కాస్పియన్ సముద్రతీరంలోని బాబోల్, సారీ, షా పట్టణాలలో భూమికంపించింది. ఈ సాయంత్రం కైహాన్ అనేవార్తా పత్రికలో, భూకంపం వల్ల 2500మంది చనిపోయినట్లు ప్రకటించింది.

ఇరాన్‌లోని అమెరికా రాయబారి 24గంటలపాటు భూకంపం జరిగిన కొన్ని ప్రాంతాలలో తిరిగి వచ్చి, బాగా దెబ్బతిన్న ప్రాంతాలకు వెళ్ళడం సాధ్యంకాలేదని విలేఖరులతో చెప్పారు. దీనికితోడు కుండపోతగా వర్షం వరదలు, అందలు విరిగి పడడం-విటితో గ్రామాల పరిస్థితి చాలా ఘోరంగా తయారైందని ఆయన అన్నారు.

## ఓడిపోయిన మంత్రులు
### ఖాళీలు సృష్టించరాదని నిర్ణయం

లక్నో, జూలై 6: ఓడిపోయిన మంత్రులకోసం ప్రత్యేకంగా ఖాళీలను సృష్టించరాదనీ, సహజంగావచ్చే ఖాళీలకు జరిగే ఎన్నికలలోమాత్రమే పోటీ చేయాలనీ కేంద్ర పార్లమెంటరీబోర్డు నిశ్చయించిందని కాంగ్రెస్ కార్యదర్శి శ్రీ శ్రీమన్నారాయణ చెప్పారు. మొన్నటి ఎన్నికలలో ఓడిపోయిన అభ్యర్థులను ఎగువసభలకు నిలబెట్టరాదని కూడా యీ బోర్డు నిర్ణయించిందని ఆయన తెలిపారు. ఈ నిర్ణయాలు అన్ని రాష్ట్రాలలోనూ అమలు జరగవలసిందే అని మరో ప్రశ్నకు సమాధానం ఇచ్చారు.

## ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ సర్వీసు కమిషన్.

ఇదివరలో ప్రిన్స్ ఆఫ్ వేల్స్ మిలిటరీ కాలేజి అని పిలువబడుచుండిన, డెహ్రాడూన్ సైనిక పాఠశాలలో ప్రవేశమునకై 1957 సెప్టెంబరు, 3, 4 తేదీలయందు హైదరాబాదులో పరీక్షలు జరుపబడును.

సెక్రటరీ, ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ సర్వీస్ కమిషన్, హైదరాబాదువారిచే డెహ్రాడూన్ నందలి సైనికపాఠశాలలో ప్రవేశించగోరువారికి 1957 సెప్టెంబరు 3, 4, తేదీలలో హైదరాబాదులో పరీక్షలు జరుపబడును. ఈ పరీక్షలో వ్రాతపరీక్ష,ముఖాముఖి ప్రశ్నలవేయు పరీక్ష రెండున్ను కలవు.

తమ తల్లిదండ్రులు లేక పోషకులు సాధారణంగా ఆంధ్రదేశములో నివసించునట్టి అభ్యర్థులనుండి, నిర్ణయించిన ఫారములో పంపబడిన దరఖాస్తు ఫారములు, ఆయా జిల్లాల కలెక్టర్ల యూలమున 1957 ఆగస్టు 1 వ తేదీకి పంచకుండా, సెక్రటరీ, ఆంధ్ర ప్రదేశ్, పబ్లిక్ సర్వీసు కమిషన్, హైదరాబాదువారికి అందవలెను. సైనిక పాఠశాలలో ప్రవేశము కోరు అభ్యర్థుల వయస్సు 20-1-1958 కి 11 సం॥లకు తక్కువ కాకుండా, 12 సం॥లకు మిక్కుటం కాకుండా వుండవలెను. కనీసపరిమితిలో యెట్టి సడలింపులు వుండవు.

ఎ. ద్యార్థుల కులములు, తెగలకు చెందిన అభ్యర్థులకు పాలుకు రు 1500/- లకు మారుగా తగ్గింపుకేటున రు 750/-లు మాత్రమే ఛార్జిచేయబడును.

ప్రాస్పెక్టసు, వివరములు, దరఖాస్తు ఫారములు, నమూనా ప్రశ్నపత్రములు వగైరాలు, సెక్రటరీ, ఆంధ్రప్రదేశ్, పబ్లిక్ సర్వీసు కమిషన్, హైదరాబాదునుండి పొందవచ్చును.

# లఘు పరిశ్రమల అభివృద్ధికి ధనలోపం అడ్డంకారాదు
## కేంద్ర పారిశ్రామిక మంత్రి హెచ్చరిక

న్యూఢిల్లీ, జూలై 6: లఘు పరిశ్రమల అభివృద్ధికి ధనలోపం అడ్డం కారాదనీ, ఈ పరిశ్రమలకు అత్యంత ప్రాధాన్యం ఈయాలనీ రాష్ట్రప్రభుత్వాల పారిశ్రామికశాఖ డైరెక్టర్ల సమావేశంలో మాట్లాడుతూ కేంద్ర పారిశ్రామిక శాఖామంత్రి శ్రీ మనుభాయ్ షా హెచ్చరించారు.

లఘుపరిశ్రమలకు కేటాయించిన మొత్తాలను ఖర్చు చేయడానికి ప్రాధాన్యం ఇవ్వాలి. ఈ రంగం శీఘ్రంగా అభివృద్ధి పొందుతూంటే, ఇందుకు అధిక మొత్తాలను కూడా కేటాయించాలి అన్నారాయన. ఇంతవరకూ ఈరంగంలో రాష్ట్రాలు సాధించిన అభివృద్ధికి అభినందిస్తూ, ఈ ఫలితాలతో మరింత అభివృద్ధికి కృషిచేయాలనీ, అందువల్ల అధికోత్పత్తితోపాటు చాలా మందికి ఉద్యోగాల అవకాశంకూడా ఉంటుందనీ ఆయన అన్నారు.

భారీపరిశ్రమలకు శాఖలుగా లఘుపరిశ్రమలను అభివృద్ధిచేయాలి. ఈవిధానంలో జరిగే అభివృద్ధికి సహాయం చేసేందుకు అనేక పారిశ్రామికులు అంగీకరించారు. లఘుపరిశ్రమల అభివృద్ధికి అనధికారులను కలిపి కేంద్రం అనేక మండలులను ఏర్పాటుచేసింది. ఇలాంటి మండలులను పారిశ్రామిక రంగంలోకూడా నియమించడం అవసరం అని శ్రీ షా అన్నారు.

ద్వితీయప్రణాళిక కాలాన్నంతటినీ లెక్కలోనికి తీసికొని, పారిశ్రామిక నగరాల అభివృద్ధి కార్యక్రమాలను సమన్వయం చేయాలి. ఈ ప్రణాళికలో పారిశ్రామిక నగరాల అభివృద్ధికి ఆయా రాష్ట్రాలకు కేటాయించిన మొత్తాలను త్వరలోనే తెలియపరచడం జరుగుతుంది అనికూడా ఆయన అన్నారు.

1957-58 వ సంవత్సరంలో కేంద్ర సహాయం తీసికొనే సమస్త పథకాలను ఈ నెలాఖరునాటికి ఢిల్లీ పంపడానికి యీ సమావేశంలో అంగీకరించారు. వివిధ రాష్ట్రాల ప్రణాళికలకు, ఋణాలకు కేంద్రం ఇదివరలో 168 లక్షల రూపాయలను కేటాయించింది. మరో 106 లక్షల రూపాయలను త్వరలోనే ప్రత్యేకిస్తోంది. ఈవిధంగా ప్రణాళికలో కేటాయించిన మొత్తంలో నూటికి 70 వంతులు సొమ్మును కేంద్రం కేటాయించింది. కాని రాష్ట్రాలు ఇంకా 108 లక్షల రూపాయలు ఖర్చుచేయవలసిన ప్రణాళికలను కేంద్రానికి సమర్పించవలసి ఉంది.

లఘుపరిశ్రమలకు సంబంధించిన చిన్న కేంద్రాలకు ఋణాలిచ్చే విషయమై కేంద్రం చేసిన సూచనలను చాలా రాష్ట్రాలు ఆమోదించాయి. నాణ్యవస్తుల ఉత్పత్తిని ప్రోత్సాహపరచేందుకు ఈ సంవత్సరంలో ప్రతి రాష్ట్రంలోను విక్రయకేంద్రాలను ఆమలుపరచడానికి వీరు అంగీకరించారు. లఘుపరిశ్రమలకు సంబంధించిన యంత్రాల దిగుమతికి విదేశీ మారక ద్రవ్యాన్ని కొద్దిగానే కేటాయించారని డైరెక్టర్లకు తెలిపారు.

## చినబీరవల్లి చెర్వు మరమ్మతు
### పరిశీలనలే గాని పని జరగదు

ఖమ్మంమెట్టు, జూలై 6: మధిర తాలూకా చినబీరవల్లి గ్రామంలోని చెరువుకు గండ్లుపడి చాలాకాలమైంది. మరమ్మతు చెయ్యడానికని ఇప్పటికి రెండుసార్లు అధికారులు పరిశీలనలు జరిపారు కాని పనిమాత్రం జరగలేదని ఆ గ్రామంలోని రైతులు చెప్పారు.

ఈ చెరువు కింది భూములకు ప్రస్తుతం వైరా ప్రాజెక్టు కాలువల ద్వారా నీళ్లు సప్లయి చేస్తున్నారు. కాని ఈ ఏర్పాటు కంటే చెరువును మరమ్మతు చేయిస్తేనే భూములకుదిగుబడి లేకుండా నీళ్లుసప్లయి కాగలవు. ఈ చెరువుకింద మూటయాభై ఎకరాల మాగాణి సాగవుతోంది. చిన్న నీటివనరుల పథకం ప్రకారం సత్వరం ఈ చెరువును మరమ్మతు చేయించడం అవసరం.

## విశాఖ నూనెశుద్ధి కర్మాగారం
### మంచినీటి సరఫరాపై ఆంధ్ర ప్రభుత్వానికి విజ్ఞప్తి

న్యూఢిల్లీ, జూలై 6: వచ్చేనెలాఖరు నాటికి విశాఖపట్టణంలోని కాల్టెక్స్ సంస్థ నూనెశుద్ధి కర్మాగారం పూర్తిగా పనిచేయడం ప్రారంభిస్తుంది. విశాఖ జిల్లాలో వర్షం లేనందువల్ల ఈ కర్మాగారానికి అవసరమైన మంచినీటి సరఫరా విషయమై, కొన్ని చిక్కులు కలుగుతున్నట్లు తెలుస్తోంది. ఈ కర్మాగారంలోని భాగాలన్నీ పనిచేయడం ప్రారంభిస్తే ఈ చిక్కు మరీ అధికం కాగలదు. త్వరలోనే ఈ భాగాలన్నీ పనిచేయడం ప్రారంభిస్తాయి కనుక అవసరమైన మంచినీటి సరఫరాకు తగు ఏర్పాట్లు చేయవలసిందని ఆంధ్ర ప్రభుత్వాన్ని కోరారని తెలిసింది.

బొంబాయిలోని నూనెశుద్ధి కర్మాగారం ఉత్పత్తిని సాలీనా 12 లక్షల టన్నుల నుండి 16 లక్షల టన్నులకు అధికం చేసేందుకు భారత ప్రభుత్వం అంగీకరించిందని తెలుస్తోంది.

# భీమవరం తాలూకాలో 4 వేల మందికి శీతజ్వరం
## కిందటి వారంలోకంటే ఈ వారం జబ్బు ఎక్కువైంది

భీమవరం, జూలై 6: భీమవరంలోనూ, భీమవరం తాలూకాలోని గ్రామాలలో శీతజ్వరం చాలా ఎక్కువగా ఉన్నది; మొత్తం సుమారు 4 వేల మందికి యీ అంటువ్యాధి వచ్చింది.

పోలీసుసేవలతో సహా ప్రభుత్వ కార్యాలయాలలో చాలామందికి ఈ జ్వరం వచ్చింది. పురపాలకసంఘ ఆరోగ్యశాఖ ఉద్యోగులు వ్యాధి నిరోధకమందులను రోజూ పంచిపెడుతున్నారు. మొత్తంమీద ఈ తాలూకాలో క్రిందటివారంకంటే ఈ వారం శీతజ్వరం ఎక్కువగానే ఉన్నది.

## పలాసాలో వెయ్యి మందికి

పలాసాలో వెయ్యిమందికి శీతజ్వరం తగిలింది. ప్రభుత్వ ఆసుపత్రిలో మందులు లేవు. రోజూ 300 మంది పేదలకు ఉచితంగా పంచాయతీబోర్డు మందులు పంచిపెడుతున్నది. ఈ వ్యాధి యింకా ఎక్కువకాకుండా కట్టుదిట్టాలు చేయించవలసినదిగా ప్రభుత్వానికి పంచాయతీబోర్డు అధ్యక్షుడు శ్రీ డి. ఎల్. రాజు విజ్ఞప్తిచేస్తున్నారు.

## కాకినాడలో సగం జనాభాకు శీతజ్వరం

కాకినాడ జనాభాలో సగంమందికి శీతజ్వరం వచ్చింది. వ్యాధి యింకా ఎక్కువకాకుండా పురపాలక సంఘ ఆరోగ్యశాఖ ఉద్యోగులు కట్టుదిట్టాలు చేస్తున్నారు. ప్రభుత్వ ఆసుపత్రికి చెందిన సంచార వైద్యదళం రోజూ పేదలకు ఉచితంగా చికిత్స చేస్తున్నది. నాన్‌గజెటెడ్ ఉద్యోగులలో చాలా మందికి ఈ వ్యాధి వచ్చింది. వారికి ఉచిత చికిత్సాసౌకర్యాలు దుర్లభమైనవి.

## పాలకోడు గ్రామంలో

రామచంద్రపురం తాలూకా పాలకోడు గ్రామంలో 500 మందికి శీతజ్వరం తగిలింది. దాదాపు అని ఇళ్ళలోనూ ఈ వ్యాధి ఉన్నది.

## వ్యవసాయాదాయం పన్ను విధింపు
### ఇది సమయం కాదని మంత్రి ప్రకటన

మదరాసు, జూలై 6: భూమిశిస్తు స్థానే వ్యవసాయ ఆదాయంపై పన్ను విధించటానికి ఇది సమయం కాదని మద్రాసు రెవిన్యూ మంత్రి శ్రీ మాణిక్యవేలు నాయకర్ చెప్పారు.

నిన్న శాసనసభలో భూమిశిస్తు పద్దుపై జరిగిన చర్చకు సమాధానం ఇస్తూ మంత్రి ఇంకా ఇట్లా అన్నారు: "రాష్ట్రంలో ఎక్కువ మంది పట్టాదార్లు రు 10 లు, అంతకులోపు శిస్తులు చెల్లించేవారే. భూమి శిస్తు స్థానే వ్యవసాయ ఆదాయంపై పన్ను విధిస్తే ఇప్పుడు వస్తున్న రు 6 కోట్ల ఆదాయం రాదని నా అభిప్రాయం. ఇదేగాక చిన్న చిన్న పట్టాదార్లలో చదువు రానివారు ఎక్కువ. అందువలన లెక్కలు అవీ తయారుచేయటం వారికి ఇబ్బంది అవుతుంది."

# ఒరిస్సా పబ్లిక్ సర్వీస్ కమిషన్ కక్కుర్తి
## డా॥ మెహతాబ్ విమర్శ: 5 గురుబంధువులకు ఉద్యోగాలు ఇచ్చినట్లు ఆరోపణ

భువనేశ్వర్, జూలై 6: ఒరిస్సా పబ్లిక్ సర్వీస్ కమిషన్ ఉద్యోగులను నిర్ణయించడంలో కక్కుర్తి పద్ధతులు అనుసరించినట్లు, ముఖ్యమంత్రి డా॥ మెహతాబ్ నేడు ఒక ఆరోపణ చేశారు.

ఈ ఆరోపణలో ఆశ్రితపక్షపాతం ఆటువంటి మాటలు లేకపోయినా, వున్న విషయం ఏమిటో డా॥ మెహతాబ్ బాహాటంగా రాష్ట్ర శాసన సభలో ప్రకటించారు. "ఈ మధ్య ఈ సంఘం మున్‌సిఫ్ ఉద్యోగాలకు నిర్ణయించిన మనుష్యులలో, 5 గురు అందులోని సభ్యుల చుట్టాలు" అన్నారు.

ఈ సంఘం సభ్యుల కక్కుర్తిని చూపించడానికి డా॥ మెహతాబ్ ఇంకో ఉదాహరణాన్ని కూడా చెప్పారు. "ఈమధ్య రాష్ట్రవిద్యాశాఖ డైరెక్టరు ఉద్యోగం ఖాళీ అయింది. ఆ ఉద్యోగానికి శ్రీ బి. ఆర్. దాస్‌ను నియమించవలసిందంటూ ప్రభుత్వం ఆయన తాలూకు ఫైలును ఈ సంఘానికి పంపించింది. కాని ఆ సంఘంవారు మాత్రం, శ్రీ దాస్ సంగతి ఆలోచించకుండా, వేరే ఇంకో ఉద్యోగి ఫైలును పంపించవలసిందని వారంతట వారు వ్రాశారు. శ్రీ దాస్ సుపీరియర్ ఉద్యోగి. ఆయన్ను కాదని వీరు వేద్దామని ఆలోచించిన ఉద్యోగి, ఆ సంఘం సభ్యుల అందరి ఇళ్లు ఎక్కిన గడప ఎక్కినట్లు, దిగిన గడప దిగినట్లు కాళ్లు బలపాలు కట్టేట్లు తిరిగాడని ప్రభుత్వం వారి వర్తమానం" అన్నారు.

## మహారాష్ట్ర ప్రజా సోషలిస్టు పార్టీ
### వైఖరి వివరణకు ముగ్గురు ప్రతినిధులు

బొంబాయి, జూలై 6: బొంబాయి శాసన సభలో సంయుక్త మహారాష్ట్ర సమితితో సంబంధం లేకుండా ఉండరాదనే మహారాష్ట్ర ప్రజాసోషలిస్టు పక్షం వైఖరిని, మహారాష్ట్ర ప్రజాసోషలిస్టుపార్టీ అధ్యక్షురాలు శ్రీమతి డి. లిమాయే, సమితి మాజీ అధ్యక్షుడు శ్రీ యస్. జి. గోరే, పార్లమెంటు సభ్యుడు శ్రీ నాథ్‌పాయ్ జాతీయ కార్యవర్గానికి వివరిస్తారు. శాసనసభలో సమితితో సంబంధంలేకుండా ఉండాలని జాతీయ కార్యవర్గం ఆదేశించడం, దానిని రాష్ట్రపక్షం ఆమోదించక పోవడం పాఠకులకు విదితమే.

శ్రీ యస్. యం. జోషీ జాతీయ కార్యవర్గ సభ్యుడే కాని శాసనసభలో ప్రతిపక్ష నాయకుడుగా అవసరమైన పని ఉన్నందువల్ల ఆయన వెళ్లడంలేదు.

ఈ విషయాన్ని గురించి చర్చించేందుకు ఈ నెల పదవ తేదీన ఢిల్లీలో జాతీయ కార్యవర్గం సమావేశం జరుగుతోంది.

## కొచ్చిన్ నౌకాసైన్య కేంద్రానికి ఉపరక్షణమంత్రిరాక

ఎర్నాకులం, జూలై 6: రక్షణశాఖ డిప్యూటీ మంత్రి శ్రీ కొత్త రఘు రామయ్య కొచ్చిన్ నౌకా సైన్య కేంద్రంలోని వివిధశాఖలు దర్శించారు. ఆయన ఉదయం నౌకాసైన్య కేంద్రం "గరుడ" కువచ్చి, స్పోర్ట్స్, వర్క్ షాపులు, మెయిన్ టెన్స్ హ్యాంగర్ చూశారు. తరువాత ఫ్లీట్ రిక్వైర్‌మెంటు శాఖ దర్శించారు. అక్కడ నౌకాబల వైమానిక కేంద్రానికి సంబంధించిన సమస్యలు గురించి ఉన్నతాధికారులతో చర్చించారు.

తరువాత ఐ. ఎన్. ఎస్. వెందురుత్తికి అనుబంధంగా ఉన్న సిగ్నల్ స్కూల్, సాంకేతిక శాఖ దర్శించారు. కమొడోర్ ఎస్. జి. కర్మార్కర్ ఆయనకు వివిధ శిక్షణాలయాలు చూపారు. నౌకా సైన్యానికి చెందిన ఆస్పత్రిని దర్శించి, శ్రీ రఘురామయ్య అక్కడి వైద్యులతోను, రోగులతోను మాట్లాడి వారి అవసరాలు తెలుసుకొన్నారు.

సాయంకాలం డిప్యూటీ మంత్రి కాంటీన్‌లో కొలదిసేపు నౌకా సైనికులతో మాట్లాడుతూ గడిపారు. వారితోకలసి తేనీరు సేవించారు.

ఈరోజున డిప్యూటీ మంత్రి మరి కొన్నిశాఖలు దర్శించారు.

విమాన బలానికి చెందిన ప్రత్యేక విమానంలో శ్రీ రఘు రామయ్య రేపు ఇక్కడినుంచి హైదరాబాదుకు బయలుదేరి వెళ్లుతారు.

## 8 వ తరగతి వరకు రాజస్థాన్‌లో ఉచిత విద్య

జయపూర్, జూలై 6: రాష్ట్రంలోని పాఠశాలలన్నిటిలోనూ ఈ సంవత్సరంనుండి 8 వ తరగతి వరకూ ఉచితంగా విద్య గరపాలని రాజస్థాన్ ప్రభుత్వం నిర్ణయించింది. ఆనుమండి 14 ఏళ్ల వయస్సువరకూ గల విద్యార్థులకందరికీ ప్రతి రాష్ట్రంలోను ఉచిత విద్య గరపాలన్న రాజ్యాంగ నిబంధన ప్రకారం ఈ నిర్ణయం చేశారు.

## విదేశాలనుండి బియ్యం దిగుమతి

తిరువేంద్రం జూలై 6: చైనా, బర్మా మొదలైన దేశాలు ఇదివరలోనే ఇతర దేశాలకు మాటఇచ్చినందువల్ల, ఈ దేశాలనుండి భారతదేశానికి బియ్యం దిగుమతినిగురించి కేంద్ర ప్రభుత్వం సందేహంగా ఉన్నదని కేరళ ఆహార శాఖా మంత్రి శ్రీ కె. సి. జార్జి అన్నారు. అందువల్ల వచ్చే మూడు సంవత్సరాలలోను బియ్యం సరఫరా క్లిష్టంగా ఉంటుందన్నారు.

హైదరాబాదులో జరిగిన దక్షిణ రాష్ట్రాల ఆహారశాఖా మంత్రుల సమావేశంలో పాల్గొని ఈయన తిరిగి వచ్చారు. దక్షిణాదిన నాలుగు రాష్ట్రాలతోను ఆహార మండలం ఏర్పాటు చేయడంవల్ల, కేరళ ఆహార సమస్య పరిష్కారం కాగలదన్నారు. ఈ మండలంలో ప్రభుత్వమే వ్యాపారం చేయడం కన్నా, స్వేచ్ఛావ్యాపారాన్ని ప్రోత్సహించాలని నిశ్చయించారని ఆయన తెలిపారు. ఈ మండలం ఏర్పాటువల్ల ఆంధ్రలో పోటీ కూడా కొంత తగ్గవచ్చు. ఏమంటే, ఈ మండలం బయటకు పంపే బియ్యం పరిమితంగా ఉంటుందన్నారు. ఈ మండలం పనిచేసే విధానాన్ని కొంత కాలంపాటు పరిశీలించి, అవసరమైతే ఇతర చర్యలు తీసికొంటారు. షాపు దుకాణాలలో అమ్మే బియ్యం ధర తగ్గించే ప్రసక్తే లేదని, గత మూడు సంవత్సరాలలోని ధరలతో పోలిస్తే, దేశంలోవివిధ ప్రాంతాలలోని బియ్యం ధరలు ఈ సంవత్సరం తక్కువగా ఉన్నాయని ఆహార మంత్రులు అభిప్రాయ పడ్డారనీ ఆయన తెలిపారు.

## కేరళ కమ్యూనిస్టు మరణశిక్ష తగ్గింపు

న్యూఢిల్లీ, జూలై 6: కేరళ కమ్యూనిస్టు శ్రీ వాసుపిళ్లెకు విధించిన మరణశిక్షను, యావజ్జీవ కారాగార వాస శిక్షగా తగ్గిస్తూ, రాష్ట్రపతి ఉత్తరువిచ్చినట్లు తెలుస్తున్నది.

1954 జనవరి పంచాయతీ ఎన్నికల సమయంలో జరిగిన అల్లరిలో ఒక కాంగ్రెసు వాదిని హత్య చేసిన నేరానికి వాసుపిళ్ళెకు ఉరి శిక్షపడింది.

ఉరిశిక్ష ఖాయపడిన తరువాత 18 మాసాలు మించి గడిచిపోయిందనే కారణం పురస్కరించుకుని, రాష్ట్రపతి ఈశిక్షను ఆజన్మ కారాగారవాస శిక్షగా తగ్గించారు.

ఇంక ఆజన్మ కారాగారవాస శిక్షను తగ్గించబోరని కేరళ కమ్యూనిస్టు ప్రభుత్వం కేంద్ర హోంశాఖకు హామీ ఇచ్చిందని తెలుస్తున్నది.

ఆజన్మ కారాగారవాస శిక్ష అంటే సామాన్యంగా 20 ఏళ్ళు జైల్లో ఉండాలన్న మాట. ఖైదీ కారాగారవాసంలో సత్ప్రవర్తనతో ఉంటే, 14 ఏళ్ళ దిర్బంధం అనంతరం అతడినివిడిచిపెట్టే ఆలోచన జరుగుతుంది.

ఇప్పుడు కేరళ ప్రభుత్వం హామీవల్ల వాసుపిళ్ళె విడుదలప్రశక్తి 1968 లోగా రాదు.

వాసుపిళ్లెను విచారించి సెషన్సుజడ్జి 1955 ఫిబ్రవరిలో ఉరి శిక్షవిధించారు. దీనిని హైకోర్టు ధ్రువపరిచింది.

దాక్షిణ్యం చూపి మరణశిక్షరద్దు పరచవలసిందని వాసుపిళ్లె మొదట తిరుకొచ్చి రాజప్రముఖునికి, రాష్ట్రపతికి విజ్ఞప్తి చేశాడు, ఇద్దరూ విజ్ఞప్తిని నిరాకరించారు.

తరువాత కేరళలో కమ్యూనిస్టు ప్రభుత్వం ఏర్పడగానే, ఉరి శిక్షలు పడిన ఖైదీలందరికీ ఆ శిక్షలను రద్దుపరిచి, నేరానికి శిక్షలు తగ్గిస్తున్నట్లు ప్రకటించింది. ఇది రాష్ట్రపతి తొలి నిర్ణయానికి విరుద్ధంగా ఉంది.

శిక్షలను తగ్గించే అధికారం ఎవరి కున్నది, రాష్ట్రపతి ఒకసారి చేసిన నిర్ణయాన్ని తరువాత మార్చుకోవచ్చునా అనే సందేహాలు బయలు దేరాయి. మరణ శిక్షను రద్దుపరిచే అధికారం రాష్ట్రపతికి మాత్రమే ఉన్నదని కేరళ ప్రభుత్వం ఒప్పుకున్నట్లు, దేశీయాంగ మంత్రి శ్రీ పంత్ లోక్‌సభలో ప్రకటించారు.

క్రిందటి జాతీయాభివృద్ధి మండలి సమావేశం సందర్భంలో కేరళ ముఖ్యమంత్రి శ్రీ నంబూద్రిపాద్ శ్రీ పంత్‌ను కలుసుకుని, వాసుపిళ్ళె తరఫున ప్రత్యేక విజ్ఞప్తి చేశారు.

హత్యా నేరం జరిగి నాలుగేళ్లు, ఉరి శిక్షపడి 18 మాసాలు పైగా గడిచిపోయిందనే కారణం పురస్కరించుకుని ఇప్పుడు రాష్ట్రపతి ఉరిశిక్ష రద్దుపరిచి, నేరానికి శిక్షను ఆజన్మకారాగారవాస శిక్షగా తగ్గించారు.

## భాషా సేవక సమితి

మదరాసు, జూలై 7: భాషాసేవ సమితి అధ్వర్యాన శ్రీ రాంభొట్ల కృష్ణమూర్తి సోమవారం 8 వ తేదీ సాయంత్రము 6 గంటలకు తిరువళ్ళిక్కేణి, పైక్రాఫ్ట్సు రోడ్‌లో టి. ఎ. టి. ఎన్. వైశ్యసర్వం హాల్లో "అజంతా, సిగిరయాలలో "చిత్రకళ"ను గూర్చి ప్రసంగిస్తారు.

## విద్యార్థుల శ్రేయోభివృద్ధి
### ధనసహాయ పరిమితి గురించి దేశ్‌ముఖ్ భావం

మద్రాసు, జూలై 6: దేశం ఆర్థికాభివృద్ధికి అనుసరించాల్సిన పథకాల కన్నా, భావితరాలవారిని తొందరగా వృద్ధిచేయగల పథకాలను అమలుపరచే పని ఎక్కువ ముఖ్యమని విశ్వవిద్యాలయాల ధనసహాయ సంస్థ అధ్యక్షుడు డా॥ సి. డి. దేశ్‌ముఖ్ యిక్కడ చెప్పారు.

డా॥ దేశ్‌ముఖ్ నిన్న ఎగ్మోర్ స్పర్‌టాంకు రోడ్డులో విశ్వవిద్యాలయ సమితి క్రీడామందిరం ప్రారంభోత్సవం చేస్తూ పైవిధంగా అన్నారు.

విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షుడు డా॥ ఏ. లక్ష్మణస్వామి మొదలియార్ డా॥ దేశ్ ముఖ్‌కు స్వాగతం చెబుతూ, విద్యార్థుల శ్రేయస్సు విషయంలో వారికిగల శ్రద్ధను గురించి ప్రస్తావించి విశ్వవిద్యాలయ విద్యార్థులందరికీ ఒక క్రీడా భవనం స్థాపించే తమ కలయిపుడు సిద్ధించేవని అన్నారు.

డా॥ యం. ఏ. తంగరాజ్ మాట్లాడుతూ యిందుకు మెడికల్ కాలేజి రూ 10000 సహాయం చేసిందని మద్రాసు ప్రభుత్వం రూ 25000 సహాయం చేయగలదని ఆశిస్తున్నామని అన్నారు. విశ్వవిద్యాలయ ధనసహాయ సంస్థకూడా యీ విషయమై సహాయం చేయుననికూడా భావిస్తున్నామని అన్నారు.

డా॥ దేశ్ ముఖ్ క్రీడామందిరాన్ని ప్రారంభిస్తూ తాము యిదివరకుచేసిన ఉద్యోగాలన్నిటికి పైకి తన యీ ప్రస్తుత పదవి చాలా ఆనందదాయకముగా ఉన్నదని అన్నారు.

విద్యార్థుల యువకుల శ్రేయోభివృద్ధి ప్రధానమైన విషయం గనక విశ్వవిద్యాలయ ధనసహాయసంస్థ తనవద్దగల నిధులకు ఆయా అవసరాలు అనుసరించి ప్రాధాన్యక్రమం ప్రకారం ధనసహాయం చేస్తోందని భావితరాల శ్రేయోభివృద్ధి అత్యంత ప్రధానమైనందువల్ల విద్యార్థులకు వసతి గృహాలు క్రీడామందిరాలు మొదలైన సౌకర్యాలకు ఎంతవరకు ధనసహాయం చేయడానికి వీలున్నదనే సంగతిని యిక ఆలోచించి నిర్ణయించవలసిఉన్నదని ఆయన చెప్పారు.

విద్యార్థులు ఒక అఖిలభారత సమాఖ్యనుకూడా ఏర్పరచుకొని వ్యవహరించాలని డా॥ దేశ్‌ముఖ్ విజ్ఞాపన చేశారు.

## హైకోర్టు సందర్శనం

శ్రీ సి. డి. దేశ్ ముఖ్ శ్రీమతి దుర్గాబాయి దేశ్ ముఖ్ నిన్న ఉదయం మద్రాసు హైకోర్టువెళ్ళి ఆ యా కోర్టులను యితర విభాగాలను ఒకగంటసేపు చుట్టిచూచారు. రిజిస్ట్రారు శ్రీ యస్. కే. గజేంద్రం నాయుడు యితర ఉద్యోగులు వారిని హైకోర్టు చుట్టూ చూపారు.

## బొంబాయి నగరపాలక సంఘంలో తెలుగులో ప్రసంగం

బొంబాయి, జూలై 4: బొంబాయి నగరపాలక సంఘాధ్యక్షుడు శ్రీ యం.వి. దొంతే ఒకసభ్యునికి తెలుగులోమాట్లాడటానికి అనుమతి ఇచ్చారు. ఇంతవరకు నగరపాలకసంఘం మరాఠీ, గుజరాతీ, హిందీ, ఉర్దూ భాషలను మాత్రం పరిగణించి వుంది.

నగరపాలక సంఘం సభ్యుడు శ్రీ అవయ్య తన మాతృభాష తెలుగులో మాట్లాడతానని అన్నారు. ఇది ఒక కొత్త సాంప్రదాయాన్ని ఏర్పాటు చేయటం అవుతోందని అంటూ నగరపాలక సంఘాధ్యక్షుడు అంగీకరించారు.

సంయుక్త మహారాష్ట్ర పక్షం తరఫున ఎన్నికైన శ్రీ అవయ్య తరువాత వచ్చీరాని ఇంగ్లీషులో తాను బొంబాయి నగరాన్ని మహారాష్ట్రంలో చేర్చాలనే సమితి విధానంతో ఏకీభవిస్తున్నానని చెప్పారు.

ఆ సమయంలో నగరపాలక సంఘం, బొంబాయిని ద్విభాషా రాష్ట్రంగా ఏర్పాటు చేసినందుకు విచారిస్తూ బొంబాయి రాజధానిగా మహారాష్ట్ర రాష్ట్రమును, గుజరాతును వేరు వేరు రాష్ట్రాలుగా ఏర్పాటు చేయగోరు తీర్మానమును చర్చిస్తున్నది.

## క్యూబా ప్రతినిధి నిర్బంధం

అమృత్‌సర్, జూలై 6: క్రిందటి నెల 24 న దొంగవ్యాపారం చేస్తున్న బ్రసెల్సులోని క్యూబా రాయబార కార్యాలయ కార్యదర్శి లీయోరాపోను ఈనెల 20 వరకూ పోలీసుల నిర్బంధంలో ఉంచవలసిందని జిల్లా మేజిస్ట్రేటు చోప్రా ఉత్తర్వుచేశారు. ఈయన రెండువపూటలలో పదిలక్షల రూపాయల హామీ ఇస్తే, జామీనుమీద విడుదల చేయవచ్చునని శ్రీ చోప్రా తెలిపారు. కాని శ్రీ ఆసామ్ముస్ జామీను ఈయలేకపోయారు.

అరెస్టు చేసినప్పుడు తొమ్మిదివందల రూపాయల భారతీయకరెన్సీనీ, కొంత విదేశద్రవ్యాన్నీ ప్రేమండి స్వాధీనం చేసికొన్నారు. అనంతరం గతఆదివారం నాడు ఈయన కారులో ఎనిమిదిన్నర లక్షల రూపాయలనుకూడా పోలీసులు వశం చేసికొన్నారు. ఇంత సొమ్ము ఈయనకారులో లభ్యం కావడంవల్ల, ఈసొమ్ముకన్నా అధిక మొత్తాన్ని హామీగా ఇస్తేతప్ప, జామీను ఈయరాదని చోప్రా అన్నారు. అందువల్ల ఆయన పదిలక్షల రూపాయలను నిర్ణయించారు.

## ఆకాశవాణి

మంగళవారం, జూలై 9

హైదరాబాదు
(411 మీటర్లు)

ఉ॥ 6-50 సుప్రభాత్ 7 తెలుగు వా 7-15 నాదస్వరం (విజయవాడ నుంచి రిలే) 7-45 కన్నడ వా 8 ఇంగ్ల వా 8-15 హిందీ వా 8-30 మరాఠీవార్తలు 8-45 భజన్

మ॥ 12-30 మిశ్రమా ధురి 12-50 మరాఠీ వా 1 మహిళా సమాజం 1-30 వాద్యగోష్ఠి 1-45 విరామసంగీతం 1-50 తెలుగు వా

సా॥ 5-30 భజన్ 5-45 హిందూస్తానీ సంగీత పాఠం 6 స్థానిక ప్రకటనలు, 6.5 ప్రాంతీయ వా 6-15 గ్రామసీమ 7 తెలుగు వా 7-30 ఉర్దూ ప్రసంగం 7-45 శ్రోతల ఉత్తరాలకు జవాబులు (ఉర్దూ) 7-50 గీతావళి 8 తపాదిక్ హుస్సేన్ 8-30 అపూర్వ రాగ కీర్తనలు 9 ఆంగ్ల వా 9-15 ఉ. వా 9-30 సంగీత రూపకం (ఉర్దూ) 10 తసాద్దిక్ హుస్సేన్ 11-30 ప్రసార సమాప్తి.

విజయవాడ
(357.1 మీటర్లు)

ఉ॥ 6-30 శుభోదయం, 6-35 ప్రసార విశేషాలు, 6-40 భక్తిరంజని, 7. తె. వా., 7-15 నాదస్వరం: కొజ వెంకట సుబ్బారావు, 7-45 సంగీత శిక్షణ, 8. ఆం. వా., 8-15 హిం. వా.

మ॥ 1. మహిళా సమాజం (హైదరాబాదునుంచి రిలే), 1-30 వాద్య సంగీతం, 1-40 హిం. వా., 1-50 తె. వా., 2. వయొలిన్.

సా॥ 5-30 నాదస్వరం: కె. వెంకట సుబ్బారావు, 6. స్థానిక ప్రకటనలు, 6-05 ప్రాంతీయ వార్తలు, 6-15 గ్రామస్థుల కార్యక్రమం, 7. తె. వా., 7-15 గ్రామస్థుల కార్యక్రమం, 7-30 వయొలిన్: సి. సుబ్బయ్య 8-30 సుగమ్ సంగీత్, 9. ఆం. వా., 9-15 సాహిత్య సంచిక, 9-30 ఆకాశవాణి వాద్య బృందం, 10. రాజా వెంకట రామయ్య, 10-30 ప్రసార సమాప్తి.

మద్రాస్ (ఎ)
(319.1 మీటర్లు)

ఉ॥ 6.50 స్వాగతం 6-55 కార్యక్రమ వివరణ 7 వాద్యసమ్మేళనం 7-15 త. వా. 7-30 టి. ఆర్. రామనాథ భాగవతర్.

మ॥ 12-30 తిలాంగ్ సలీంద్ 1 మహిళాసమాజం (హైదరాబాదునుంచి రిలే) 1-30 గీతమంజరి 1-40 హిం.వా. 1-50 గీతమాలిక 2 త. వా. 2-10 వీణ 2-40 సారంగి 2-50 ఆర్. బి. రాజేశ్వరి.

సా॥ 5 పాశ్చాత్య సంగీతం 5-30 లలితాశాస్త్రి 6-05 ప్రాంతీయ వా. (తమిళం) 6-15 టి. ఆర్. రామనాథ భాగవతర్ 6-45 ఆసీమిజన్ 7-15 త. వా. 7-30 గానలహరి 7-45 క్లారినెట్ 9 సుగమ్‌సంగీత్ 9-15 హిందీపాఠం 9-30 ఆకాశవాణి వాద్య బృందం (విజయవాడనుంచి రిలే) 10 గానలహరి 10-30 ప్రసారసమాప్తి.

మద్రాస్ (బి)
(211.3, 41.82 మీటర్లు)

ఉ॥ 6-50 ఎ వలె 7 త. వా. 7-15 ఉదయగానం 7-30 ఎ వలె 8 ఆం.వా.
(211.3, 31, 28 మీటర్లు)

మ॥ 12 కార్మికుల కార్యక్రమం 12-30 ఎ వలె 1 గీతమాలిక 1-30 ఆం. వా. 1-40 గీతమంజరి 1-50 తె. వా. 2 సుగమ్ సంగీత్ 2-10 ఎ వలె.
(211.3, 49.30 మీటర్లు)

సా॥ 5 ఎ వలె 5-50 స్థానిక ప్రకటనలు, 6 ఆం. వా. 6-05 ప్రాంతీయ వార్తలు 6-15 గ్రామస్థుల కార్యక్రమం 7 త. వా. 7-15 గ్రామస్థుల కార్యక్రమం 7-30 తమిళ ప్రసంగం (తిరుచ్చినుంచి రిలే) 7-45 ఎ వలె 9. ఆంగ్ల వా. 9-15 తమిళ నాటిక 9-30 సుగమ్ సంగీత్ (తిరుచ్చినుంచి రిలే) 10 ఎ వలె 10-30 ప్రసార సమాప్తి.

## దేవకరణ్‌నంజిబ్యాంకి

మద్రాసు, జూలై 5: దేవకరణ్ నంజి బ్యాంకి లిమిటెడ్‌కు 1957 జూన్ 30 వ తేదీలో అంతమైన అర్ధసంవత్సరానికి నికరలాభం నిరుటి లెక్కలోనుంచి చేర్చినమొత్తం రు. 213141-28 కలుపుకొని రూ. 1057988-03 చేకూరినది.

ఈ మొత్తాన్ని డైరెక్టర్లు యీ క్రింది పద్దులక్రింద జమకట్టటానికి తీర్మానించి ఉన్నారు.

జూన్ 30 వ తేదీతో అంతమైన అర్ధసంవత్సరానికి ఆదాయపన్ను ఉచితంగా వాటా 1 కి రూ. 1-4-0 వంతున తాత్కాలిక డివిడెండును పంచటానికి రూ. 125000-00.

పన్ను కట్టటానికి యితర వాటికి రాబోయే అర్ధసంవత్సరపు లెక్కకు జమకట్టటానికి రూ. 932988-03 మొత్తం రూ. 1057988-03.

జూన్‌తో అంతమైన యీ అర్ధసంవత్సరంలో బ్యాంకిబిజినెస్ అభివృద్ధిని పొందినది. మొత్తం డిపాజిట్లు రూ. 20 కోట్లకు పైబడినది. బ్యాంకినిధి రూ. 25 కోట్లకు మించినది. 1956 జూన్ 30 వ తేదీతో అంతమైన అర్ధసంవత్సరంలో బ్యాంకికి కొద్దిగా రూ. 6 లక్షలకు లాభం లభించినది. నికరలాభంకూడా యీ అర్ధసంవత్సరం రూ. 2 లక్షలకుపై వృద్ధిఅయినది. 1956 సంవత్సరానికి లాభాలు రూ. 14 లక్షలపైగా చేకూరినవి.

## దక్షిణ రైల్వే
### టెండరు నోటీసు

చీఫ్ అపరేటింగ్ సూపరింటెండెంటు, దక్షిణ రైల్వే, మద్రాసు-3 వారు యీ క్రింద వివరించిన లోకోమోటివ్ షెడ్సులో అందుకు రొదురుగా వివరించిన కాలములో ట్రాలియల్ సర్దుబాట్లు చేయుటకు సీలువేసిన టెండర్లు కోరుచున్నారు.

| షెడ్ | కంట్రాక్టు కాలము | | బయానా మొత్తం | చెల్లించవలసిన వారు | టెండరు ఫారములు ఇచ్చి పుచ్చుకొనువారు |
|---|---|---|---|---|---|
| పోయనరం- | | | | | |
| తిరుచిరాపల్లి | 20-8-57 | 31-8-59 | 300/- | DAO/TPJ | DS(M)/TPJ |
| తంజావూరు | 20-8-57 | 31-8-59 | 300/- | DAO/TPJ | DS(M)/TPJ |
| పాకాల | 18-8-57 | 31-8-59 | 1,000/- | చీఫ్ క్యాషి యర్ మద్రాసు | DS(M)/GTL |

టెండర్లు నిర్ణయించిన ఫారములోనే పంపవలెను. పదగు ఫారము ఖరీదు రు 3/- చెల్లించి ఆయా డివిజనల్ సూపరింటెండెంటు(మెకానికల్)వారినుండి పొందవలెను. ఈ సొమ్ము యే పరిస్థితిలోను తిరుగురాదు.

31-7-57 తేదీ తరువాత టెండరుఫారములకై పంపు మనియార్డర్లు, డివిజనల్ సూపరింటెండెంటు, (మెకానికల్) వారిచే అంగీకరింపబడవు.

టెండర్లు పెట్టదలచినవారు పైన తెల్పినప్రకారం చెల్లించవలసిన బయానా మొత్తమును 2-8-1957 తేదీన లేక ఆ తేదీకి ముందుగా చెల్లించవలెను.

టెండర్లను డివిజనల్ ఆయా సూపరింటెండెంటు (మెకానికల్) వారికి 5-8-1957 తేదీన లేక అంతకుముందుగా మ॥ 3 గం॥లలోగా చెల్లించవలెను.

టెండరువెంట ఇటీవలి ఇన్‌కంటాక్సు చెల్లించిన సర్టిఫికేటు పంపవలెను. లేనంతట అవి ఆలోచనకు తీసికొనబడవు.

ఏ కారణములు తెలుపకనే దాఖలైన టెండర్లలో దేనినైననూ, లేక అన్ని టెండర్లను త్రోసివేయు హక్కు చీఫ్ ఆపరేటింగు సూపరింటెండెంటు రిజర్వు చేసికొని యున్నారు.

మదరాసు, } చీఫ్ ఆపరేటింగు సూపరింటెండెంటు.
2-7-57. }

# ఆసియాభావం, అరబ్ జాతీయ వాదం అంటూ ఎక్కడాలేవుట

## కామన్‌వెల్తు ప్రధానుల సభలో ఐక్ సూత్రాన్ని బలపరుస్తూ పాక్ ప్రధాని విచిత్రవాదం

లండన్, జూలై 6: పాకిస్తాన్ ప్రధానమంత్రి శ్రీ సురావర్ది, కామన్‌వెల్తు ప్రధానుల సభలో ఐసెన్‌హోవర్ మధ్యప్రాచ్యసూత్రాన్ని బలపరుస్తూ మాట్లాడుతూ, ప్రపంచం అరాబ్ జాతీయవాదం అంటూగాని, ఆసియా భావం అంటూగాని, ఏమీలేదని వాదించినట్లు ఇప్పుడు తెలియవస్తోంది. ఈ సభతో సన్నిహిత సంబంధీకులు ఈ సభలో శ్రీ సురావర్ది ధోరణిని ఇప్పుడు బయటపెడుతూ వున్నందువల్ల ఇది ఇట్లా తెలియవస్తోంది.

శ్రీ సురావర్ది ఈసమావేశాల్లో ఇంత ఇదిగా ఐక్ సూత్రాన్ని బలపరచడమే గాక, శాంతియుత సహజీవన సూత్రం మీదకూడా గట్టిగా ధ్వజంఎత్తినట్లు, అప్పుడే ఈమాటలు అన్నట్లు ఈ అభిజ్ఞ వర్గాలవారు చెబుతున్నారు.

శ్రీ సురావర్ది ఈమాటలు అన్నట్లు విని, ఇక్కడి అరబ్ ఆసియా వర్గాల వారు ఆశ్చర్యపోతున్నారు. ఐసెన్‌హోవర్ సూత్రాన్ని ఆయన ఎంతగానైనా సమర్థించుకోవచ్చుగాని, అందుకోసం ఇట్లా బరితెప్పి మాట్లాడ్డంమాత్రం విచిత్రంగా వున్నదని, ఇట్లా మాట్లాడి శ్రీ సురావర్ది తన హద్దులు ఏమిటో మరిచిపోయి వ్యవహరించాడని వీరు అంటున్నారు. అమెరికావారుగూడా అంతర్జాతీయ సమావేశంలో ఇంత ఇదిగా బరితెగి మాట్లాడ్డంఅంటూ వుండదు. ఈయన మాట్లాడ్డం, తనదేశాన్ని ఇట్లా ఒక భావానికి కట్టివెయ్యడం విచిత్రంగా వున్నదనిగూడా వీరు అంటున్నారు.

పాకిస్తాన్ ప్రధాని మాటలు వీరికి ఎంతమాత్రం నచ్చడంలేదు. ఆయన అట్లా అన్నందుకు కొంచెం కోపాన్నికూడా వీరుచూపిస్తున్నారు. అమెరికా కట్టిన సైనికమండలాల్లో చేరి, పాకిస్తాన్, ఆసియా-అరబ్ రాజ్యాలకు దూరం అయిపోయింది. తాస్తై, పాకిస్తాన్ ఈ తెగతెంపులు చేసుకుంది. కాని బాండుంగ్ రాజ్యాలలోంచి ఇంకా పోలేదు. అంతేగాక, ఆసియా దేశాలలో జాతీయోద్యమాలను గూర్చి చర్చలు వచ్చినప్పుడు, ఆ ఉద్యమాల పట్ల, సానుభూతినిగూడా చూపుతూ వచ్చింది. అందువల్ల ఇప్పుడు, యీ ప్రధాని శ్రీ సురావర్ది ఇట్లా మాట్లాడ్డం ఈ అరబ్-ఆసియారాజ్యాల వర్గాలకు కష్టంగావుంది.

# రష్యా విధానాలు మారవు

## మాస్కో రేడియో ప్రకటన

లండన్, జూలై 6: మాలటోవ్ మాలెంకోవ్-కగనోవిచ్ వర్గాన్ని బహిష్కరణ చేసినందువల్ల, రష్యా విదేశాంగ విధానం కాని, ఆంతరంగిక పరిపాలన విధానంకాని మారదని, మాస్కో రేడియో వ్యాఖ్యాత ఒకరు నిన్న రాత్రి ప్రకటించారు.

ఈ నాయకవర్గం 20వ కమ్యూనిస్టు కాంగ్రెసు నిర్ణయాలను ప్రతిఘటించినందువల్ల బహిష్కరణ అయినారు. అందువల్ల, ఆ నిర్ణయాల ప్రకారమే రష్యా తన విధానాలను తీర్చిదిద్దుకుంటున్నది కాబట్టి, మారిపోతవనుకోడం పొరపాటు, అని వీరన్నారు.

## దేశమంతటా క్రోధం పొంగిపోతోంది

పార్టీ వ్యతిరేకవర్గమైన మాలటోవ్ వర్గం పట్ల రష్యా అంతటా ప్రజలలో క్రోధం పొంగిపోతున్నదని, "ప్రవదా" పత్రిక ఇవాళ వ్రాసింది.

సామ్యవాద వ్యవసాయంలో మారిన ప్రణాళి. కొవి భావాన్ని ప్రతిఘటించారని బహిష్కరణ అయిన నాయకులపై ఈ పత్రిక దోషం ఆరోపించింది.

సమిష్టిక్షేత్రాలనుండి నిర్బంధంగా నేద్యఫలాన్ని వసూలుచేసే పూర్వ అధికారిక మనస్తత్వాన్ని వీరు విడిచిపెట్టక, ప్రజల ఆహారాది వస్తువుల అవసరాలను నిర్లక్ష్యం చేసి, మారిన విధానాన్ని ప్రతిఘటించారు.

సమిష్టిక్షేత్రాలూ, ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాలూ పంటలు పండించడంలో ఈమధ్య అపారంగా అభివృద్ధి చూపించినందువల్ల, వారివద్ద నిర్బంధపు వసూళ్ల పద్ధతిని ప్రభుత్వం రద్దుపరిచిందని "ప్రవదా" తెలిపింది.

### కైలాసనాథునికి లక్ష బిల్వార్చన

చిత్తూరు, జూలై 7: నారాయణవనం సమీపాన అరుణానది దక్షిణ తీరంలో కొకముఖ పర్వత ఉత్తర భాగంపై ఉన్న శ్రీ కైలాసనాథేశ్వర స్వామికి యీ నెల 11వ తేదీ గురువారం ఆషాఢ శుద్ధ పౌర్ణమినాడు, లక్షబిల్వార్చన మహోత్సవం జరుగుతుంది.

# భారత ఆదర్శం

(1 వ పుట తరువాయి)

న్ని తొలగించవలసిన అవసరాన్ని గూర్చి ప్రసంగించారు. ఆ అనంతరం సమాజవికాస కార్యక్రమాన్ని గూర్చి మొదలుపెట్టారు. దీన్నిగూర్చి పాశ్చాత్య దేశాలకు అంతగా ఏమీ తెలియదు. ఆయన ఈ విషయాన్నిగూర్చి ఉద్రేకంతో మాట్లాడారు. ఆయన్ని వింటుంటే, నిజంగా మనకుకూడా సానుభూతి కలుగుతుంది. అయితే ఈవిషయం భారతదేశానికి ముఖ్యం కావచ్చు. ఇక్కడ మనకు బ్రిటన్‌లో రేమి ముఖ్యం అని అనిపిస్తుంది. అది ప్రపంచం అంతకు ముఖ్యం. శ్రీ నెహ్రూతో మాట్లాడ్డంవల్ల నేను ఇది గ్రహించాను" అని శ్రీ జాకబ్‌సన్ వ్రాశారు.

శ్రీ జాకబ్‌సన్ ఇంకా ఇలా వ్రాశారు: "శ్రీ నెహ్రూ నాతో ఇలా అన్నారు: మాదేశంలో కొన్ని లక్షల గ్రామాలు వున్నాయి. ఇప్పుడు అందులో 3½ లక్షల గ్రామాలలో ఈ సమాజవికాస కార్యక్రమం అమలు జరుగుతోంది. మేము చేస్తున్న అన్నిపనులలోకి ఇది ముఖ్యమైంది. మా రైతులు పాతపద్ధతులలో మునిగి, స్తంభించిపోయివున్నారు. వారికి పంటలను అధికంగా పండించడాన్నిగూర్చి కొత్తపద్ధతులు తెలియవు. పశువులను సరిగా చూచుకోవడం తెలియదు. మురికిరోడ్డు వేసుకోవడం చేతకాదు. కాలవ త్రవ్వుకోవడం రాదు. ఇప్పుడు అన్నింటిని యువజనులు గ్రామాల్లో సైకిళ్ళమీద తిరుగుతూ, వారికి తెలియజేస్తున్నారు. రైతులను సమావేశపరచి, ఈ అన్ని సంగతులను వారికి బోధిస్తున్నారు. ఆసియాలో మాదుమల్లేనే, రైతు జనోద్ధరణకు, దేశాభివృద్ధికి, గట్టిగా పనిచేస్తున్న దేశం ఇంకొకటిమాత్రమే వుంది. అది చైనా. అయితే చైనాలో కమ్యూనిజం అధికారంలోకి వచ్చింది. వారి పద్ధతులు వేరు. మా పద్ధతులు వేరు. ఇప్పుడు మా పద్ధతులద్వారా దేశాభివృద్ధి సాధ్యం అని ఋజువు చేయవలసి వుంది."

"ఈ మాటలు చెబుతున్నప్పుడు శ్రీ నెహ్రూ కళ్ళు ప్రకాశించాయి. ఏదో మహాదృష్టి ఆకస్మికంగా లోంచి, ఆయన్ని పూర్తిగా మార్చివేసింది. మాటలు అప్రయత్నంగా ఆయన నోటి వెంట వచ్చేస్తున్నాయి. ఆయనలో వున్న అభినివేశం కొట్టవచ్చినట్లు కన్పించింది. ఎవరికైనా అప్పుడు సానుభూతి కలుగుతుంది. ఆయన ఎందుకు ఇది అంతా చెబుతున్నాడో అర్థం అవుతుంది. మనలాగానే, భారతదేశం గూడా పార్లమెంటరీ ప్రజాస్వామ్య పద్ధతులలో దేశాభివృద్ధిని సాధించడానికి పూనుకొని పనిచేస్తోంది. యుద్ధానంతరం మనం ఎట్లా ప్రణాళికలు వేసుకొని పనిచేశామో, అట్లాగే, ఇప్పుడు భారతదేశం పనిచేస్తోంది. ఆసియా ఆసియా అంతా భారతదేశంలో జరుగుతున్న ఈ కృషిని, చైనాలో జరుగుతున్న ఆ కృషిని చూస్తోంది. చైనాలో కమ్యూనిస్టు పద్ధతులవల్ల పని జరిగి, భారతదేశంలో ప్రజాస్వామ్య పద్ధతుల వల్ల పని జరక్కపోతే, ఆసియాలో ప్రజాస్వామ్యానికి ఇక పుట్టగతులుండవు. అది జరిగిన నాడు, ఒక్క భారతదేశమే కాదు దెబ్బతినేది, ప్రజాస్వామిక ప్రపంచం అఖిలము దెబ్బతిని పోతుంది. శ్రీ నెహ్రూ ఈ విషయాన్ని బాగా గ్రహించారు. మనంగూడా దాన్ని గ్రహించాలి. అందుకే భారతదేశంలో గ్రామాల ఉద్ధరణకోసం ఏమి జరుగుతున్నది మనం గూడా ఆసక్తితో తెలుసుకోవాలి. ఆ కృషి విజయవంతం అయ్యేట్లు చూడాలి.

# ఎన్. జి. వోల కోరికల వారం

## హైదరాబాదులో ప్రారంభం

హైదరాబాదు, జూలై 6: "ఎన్. జి. వో. ఆపదలో ఉన్నాడు" అనే నినాదాలున్న బాడ్జీలతో నగరంలోని సుమారు 7 వేల మంది నాన్‌గజెటెడ్ ఉద్యోగులు ఇవాళ్ళ తమ తమ కార్యాలయాలకు హాజరైనారు.

సచివాలయంలోని నాన్‌గజెటెడ్ ఉద్యోగులూ, ఇతర శాఖలలోని నాన్‌గజెటెడ్ ఉద్యోగులూ వ్యవసాయ శాఖ డైరెక్టరు కార్యాలయం ఎదుట సాయంకాలం అయిదు నిమిషాల సేపు హాజరై ఎవరి దోవనవారు వెళ్ళిపోయినారు.

తూర్పు గోదావరిజిల్లాలోని నాన్‌గజెటెడ్ ఉద్యోగులు కూడా ఇక్కడికంగా "ఆపద" బాడ్జీలతో కార్యాలయాలకు హాజరైనారని కాకినాడనుంచి వార్త వచ్చింది.

# బాగ్దాద్ కూటమివల్ల యుద్ధ ప్రమాదం

## చెస్టర్ బౌల్స్ హెచ్చరిక

న్యూయార్క్, జూలై 6: అమెరికా అనుసరించిన విధానాలవల్ల బాగ్దాద్ కూటమిలోని పశ్చిమాసియా రాజ్యాలలోని బలాబలాలు తారుమారయ్యాయనీ, ఈ దేశాలకు ఇంకా ఆయుధాలను సరఫరాచేస్తే యుద్ధంవచ్చే ప్రమాదం ఉన్నదనీ భారతదేశంలోని మాజీ అమెరికా రాయబారి చెస్టర్ బౌల్స్ హెచ్చరించారు.

న్యూయార్క్ టైమ్సు పత్రికలో ఒకవ్యాసం వ్రాస్తూ, బ్రిటన్, టర్కీ, పాకిస్తాన్, ఇరాన్, ఇరాక్‌లు గల బాగ్దాద్ కూటమివల్ల అమెరికా ఎంతో ఖర్చు చేయవలసివస్తోందన్నారు.

ఈ దేశాలకు పరిసర పశ్చిమాసియా రాజ్యాలదాడుల నెదుర్కొనేందుకు అవసరమైనఆయుధాలనన్నిటినీఇస్తున్నారు. ఈ ఆయుధాలను సరఫరా చేయడం నిజంగా సోవియట్ ప్రమాదాన్ని ఎదుర్కొనడం కాదనీ, పరిసర దేశాల దాడులను ఎదుర్కొనడానికీ, అయా ప్రభుత్వాలను సుస్థిరం చేసికోవడానికీ మాత్రమేననీ చాలామంది భావిస్తున్నారు. ఇలాంటి ఖర్చులను ఆమోదించడం సమంజసమా అని ఆయన కాంగ్రెసును ప్రశ్నించారు. ఇలాంటి ఆయుధ సరఫరాను, ఆయా ప్రాంతాలలోని పోటాపోటీలు అణగద్రొక్కడానికి ఉపయోగిస్తారనేది విదితం కావడం లేదా అనీ, అప్పుడు అమెరికా లక్ష్యం ఏమి నెరవేరుతోందనీ అన్నారు.

## భారత ప్రణాళికల సాఫల్యావసరం

పాకిస్తాన్‌కు అమెరికా ఇచ్చిన ఆయుధాలవల్ల, భారతదేశం పదికోట్ల డాలర్లకుపైగా ఖర్చుచేసి, బ్రిటన్, ఫ్రాన్సులనుండి సైనికవిమానాలను కొనుక్కోవలసి వచ్చింది. ద్వితీయ ప్రణాళికకు అవసరమైన మొత్తంనుండి ఈసొమ్మును భారతదేశం ఖర్చుపెట్ట వలసివచ్చింది. ప్రజాస్వామ్యమనుగడకు భారతదేశ ప్రణాళికలు సఫలం కావాలని ఎంతోమంది విశ్వసిస్తున్నారు. కాని, పాకిస్తాన్‌కు అమెరికాచేస్తున్న సైనికసహాయంవల్ల భారతదేశ ప్రణాళికలవిజయం కష్టతరంఔతోంది అని ఆయన హెచ్చరించారు.

అంతర్జాతీయ రంగంలో పశ్చిమ రాజ్యాలబలాలను పటిష్టం చేసికొనేందుకు పశ్చిమాసియా రాజ్యాలకు సైనిక సహాయంచేశారు. కాని ఈ సహాయం వల్ల ఆరాజ్యాలలోని బలాబలాలు తారుమారయ్యాయి. ఇంకా ఆయుధాలను సరఫరాచేస్తే, యుద్ధప్రమాదం ఉంది. ఆదేశాలలోని ప్రజల అభివృద్ధికి కృషి చేయాలనే ప్రాథమిక దృక్పథమే ఈ దేశాలలో ప్రబలుతోంది. ఇందుకు కారణం అమెరికా విధానమే. కమ్యూనిజంవల్ల కలిగే భయంతో మనం వ్యవహరించకూడదు. ఏమంటే శాంతి, అభ్యుదయాలతోకూడిన ప్రపంచాన్ని సృష్టించాలి. స్వాతంత్ర్యంపొందిన ప్రజలే దానిరక్షకులు అన్నారాయన.

# ఆసియాలో నవ చైతన్యం

## నెహ్రూ ప్రసంగం

లండన్, జూలై 6: ఆసియా అంతటా ఒక శాంతి చైతన్యమూ, దానితోపాటు పారిశ్రామిక విప్లవమూ తల ఎత్తి, కొనసాగుతున్నాయని, ఈ మహాఉద్యోగం సాగుతూ వున్నప్పుడు ఆసియాలో ఒక దేశం ప్రభావం, ఇంకొదేశంమీద పడక తప్పదని ప్రధానమంత్రి శ్రీ నెహ్రూ నేడు బ్రిటన్‌లోని భారత విద్యార్థులతో మాట్లాడుతూ చెప్పారు.

శ్రీ నెహ్రూ ఈ సందర్భంలో హిందీలో మాట్లాడారు. ఇలా అన్నారు: భారతదేశం అభివృద్ధికోసం మహా కార్యాన్ని తలపెట్టాము. ఈ కార్యం నిర్విఘ్నంగా కొనసాగాలంటే, మన స్వయంకృషితో, సంపదను సృష్టించుకోవాలి. ప్రపంచంలో ప్రతి వెనకబడివున్న దేశమూ ఎదుర్కొంటున్న సమస్య ఇది. స్వంతంగా, సంపదను సృష్టించుకోవడం ఎట్లు? ఇదే సమస్య. విదేశాలనుంచి సహాయం పొందరాదని నేను అనను. కాని దానితో కష్టాలు తీరవు. మన అంతటమనం సంపదను సృష్టించుకోగలిగినప్పుడే అవి తీరుతాయి. దేశంలో ఇప్పుడు పరిశ్రమలను పెంపొందించుకోవలసివుంది. వాటిని పెంపొందించుకుంటూ, వ్యావసాయిక ఉత్పత్తిని అధికం చేసుకోవలసివుంది. ఇది చాలా ముఖ్యమైంది. మీరంతా ఈ కృషి తదాత్మ్యకల్పన్ని భజించి, పనిచెయ్యాలి. ఈ మహాకృషిలో మీరు కూడా ఒక భాగమే. అట్లా ఆలోచిస్తూ మీ శక్తిసామర్థ్యాలను పెంపొందించుకొని దేశం సేవలో వాటిని వినియోగించాలి.

# గుంటూరు జిల్లాలో ఉద్యోగుల ప్రదర్శన

గుంటూరు జిల్లాలోని 100 ప్రభుత్వ కార్యాలయాలకు చెందిన దాదాపు 2 వేల మంది నాన్‌గజెటెడ్ ఉద్యోగులూ "బాధలను" తెలియచేసే బాడ్జీలతో ఈ నెల 6వ తేదీన కార్యాలయాలకు హాజరైనారు. ఖచ్చితంగా సాయంకాలం అయిదింటి దాకా పని చేశారు. కొన్ని కార్యాలయాల ప్రధానాధికారులు కూడా ఈ బాడ్జీలను ధరించారు.

# ఇజ్రాయల్‌ను మెచ్చుకుంటూ అంతర్జాతీయ సోషలిస్టుల తీర్మానం

## వెనుకబడిన దేశాల సహాయార్థం సమితి నిధి స్థాపనకు విజ్ఞప్తి

వియన్నా, జూలై 6: అరబ్ దేశాల ఇజ్రాయల్ చేస్తున్న పని మహానిర్మాణాత్మకంగా వున్నదని మెచ్చుకుంటూ అఖిల ప్రపంచ సామ్యవాదమహాసభ నేడు ఒక తీర్మానంలో పేర్కొంది.

ఈ సభ నేటితో ముగిసింది. ఇందులో వీరు అరబ్ దేశాలను గూర్చి ఒక తీర్మానాన్ని, అంతర్జాతీయ వ్యవహారాలనుగురించి ఒక తీర్మానాన్ని, వెనకబడివున్న దేశాల సహాయాన్నిగూర్చి ఇంకో తీర్మానాన్ని, మొత్తం మూడు తీర్మానాలు ఆమోదించారు.

## అరబ్ దేశాల వ్యవహారాలు

అరబ్ దేశాలను గూర్చిన తీర్మానంలో, అరబ్ రాజ్యాలను గూర్చి విమర్శ, ఇజ్రాయల్‌నుగూర్చి మెప్పు దలవున్నాయి. మధ్యప్రాచ్యంలో అభివృద్ధికి ఆటంకంగా, శాంతికి విరోధంగా ప్రవర్తిల్లుతున్న ఉద్రిక్త పరిస్థితిని చూచి వీరు ఇందులో తమ ఆందోళనను ప్రకటించారు. అరబ్ రాజ్యాలను, ఇజ్రాయల్‌ను ఒకచోట చేర్చి, శాంతిసమాలోచనలు ప్రారంభం అయ్యేట్లు అంతా ప్రయత్నించాలని ఒక సూచనగూడా చేశారు.

## మూడు ముఖ్య విషయాలు

అరబ్ దేశాలలో అసలు సమస్యలను పరిష్కరించాలంటే, ఈ క్రింది వ్యవహారాలను తేల్చవలసివుంటుంది అని ఈ సభవారు భావిస్తున్నారు. (1) అగ్రరాజ్యాలు అరబ్ రాజ్యాలకు ఆయుధాలను ఇస్తూ ఈ ప్రాంతం వ్యవహారాలలో జోక్యం చేసుకుంటున్నాయి. ఇందువల్ల అక్కడ ఆయుధాల పోటీ అధికం అవుతోంది. (2) అరబ్ రాజ్యాలలో జీవన ప్రమాణాలు అతి తక్కువగా వున్నాయి. ఆ పరిస్థితి బాగుపడితేనేగాని, యేమీ జరగదు. (3) ఇజ్రాయల్‌తో అరబ్ రాజ్యాల విరోధభావం ఎంతమాత్రం తగ్గకుండా ఉంది. ఆ విరోధాన్ని తగ్గించుకోడానికి, అరబ్ రాజ్యాలు తృణీకరిస్తున్నాయి. ఇందువల్లగూడా ఆ ప్రాంతంలో ఉద్రేకాలు పెరుగుతున్నాయి.

## ఇజ్రాయల్ నౌకలు

ఈ తీర్మానంలోనే వీరు సూయజ్ కాల్వ, అకాబా సింధుశాఖలను గూర్చి గూడా ప్రసంగించారు. సూయజ్ కాల్వలో, ఇజ్రాయల్‌తోసహా అన్ని దేశాల నౌకలను వెళ్ళనీయాలన్నారు. అకాబా సింధుశాఖ విషయంలో గూడా ఇట్లాగే మాట్లాడారు. ఇదంతా సమితిక్రింద జరగాలన్నారు.

## అరబ్ కాందిశీకులు

ఇక పాలస్తీనాయుద్ధంవల్ల కాందిశీకులైపోయినవారి విషయమై, యీ అంతర్జాతీయ సోషలిస్టులకు పట్టింది ఇంతమాత్రంగావుంది. సమితి అధ్వర్యం క్రింద వీరి పునరావాసకార్యాలకు సహాయం జరగాలిట. మధ్యప్రాచ్య రాజ్యాల మధ్య సామరస్యాన్ని పెంపొందించడానికిగాను యీ సహాయాన్ని ఉపయోగించాలిట.

## వెనుకబడివున్న దేశాలకు డబ్బు

వెనుకబడిన దేశాల సహాయంకోసం సమితి ప్రత్యేకనిధి స్థాపనకు తాము పూర్తిగా సమర్థిస్తామని వీరు ఇంకో తీర్మానంలో పేర్కొన్నారు. "ఈ నిధి స్థాపననుగూర్చి ఎంతకాలంనుంచో వాగ్దానాలు అవి వినబడుతున్నాయి. ఇది ఎంత త్వరలో అమలులోకి వస్తే అంత మంచిది" అని వీరు యీ తీర్మానంలో పేర్కొన్నారు.

చిత్రం ఏమిటంటే యూరప్ వేసవి ఉధృతానికి తట్టుకోలేక పోతుందంటే భూమధ్యరేఖకు సమీపంగా ఉన్న కొన్ని ప్రాంతాలలో, ముఖ్యంగా ఫ్రెంచి ఈక్వటోరియల్ ఆఫ్రికాలో ఉష్ణం 30 డిగ్రీల సెంటిగ్రేడుకు ఎక్కించనేలేదు.

# యూరప్‌లో వేసవి ఉధృతం

పారిస్, జూలై 6: ఇంతకుపూర్వం ఎన్నడూ లేనంత వేడిమి ఇవాళ యూరప్ అంతటా ప్రజలను వ్రేల్చివేస్తున్నది.

పారిస్‌లో ఇవాళ ఉష్ణోగ్రత 35.5 డిగ్రీల సెంటిగ్రేడ్ (96 డిగ్రీలు ఫారెన్‌హీట్)కు పెరిగింది. [1881లో అత్యుష్ణ ప్రమాణం 34.7 డిగ్రీలు సెంటిగ్రేడ్ మాత్రమే ఇంతవరకూ తెలిసిన గరిష్ఠ ప్రమాణం.]

ప్రాగ్ నగరంలో 41 డిగ్రీలు సెం॥ వచ్చింది.

ఎల్బ్‌నదిలో నౌకాయానాన్ని అధికారులు రద్దుపరిచారు.

డ్రెస్డెన్, గోర్లిజ్ (తూర్పు జర్మనీ) ప్రాంతాలలో వేడిమికి రోడ్లపై తారు పూత పాడైంది.

పశ్చిమ జర్మనీలోని బవేరియన్ సరస్సులలో నీరు గోరు వెచ్చనైనాయి.

ఆచెన్ (పశ్చిమ జర్మనీ)లో ఎండలకు భరించలేక 45 పందులు చచ్చిపోయాయి.

వేసవిలో చల్లదనానికి ప్రసిద్ధికెక్కిన స్విస్ విరామకేంద్రాలకుకూడా ఎండ వేడిమి తాకిడి తప్పలేదు.

లగ్జెంబర్గ్‌లో నీటింకి రేషనింగు ప్రవేశపెట్టారు.

# ఆంధ్ర శాసనసభ్యుల హితవు

(1 వ పుట తరువాయి)

బడి ఉన్నాయి. భారత రాజ్యాంగ చట్టంకూడా అదే విధంగా ఆదేశిస్తోంది. కాబట్టి తెలంగాణాలో కూడా మద్య నిషేధం ప్రవేశపెట్టడం ప్రభుత్వంవిధి."

## గ్రామాల సంగతి మరచారు

శ్రీ గోపిడి గంగిరెడ్డి (సోషలిస్టు) రెండవ పర్యాయంకూడా ఆయవ్యయ పత్రాలను తెలుగులో యివ్వలేక ప్రభుత్వం తన అసమర్థతను ఋజువు చేసుకొందన్నారు. రాజకీయంగా మనమంతా ఏకమైనా, ఆర్థిక రంగంలో, లెక్కలు వేయడంలో యీ విభజన ఎందుకు అని విమర్శించారు.

"గ్రామప్రాంతాల అభివృద్ధికి యీ బడ్జెట్‌లో ఏ అవకాశములేదు. గ్రామాల సంగతి యిప్పటికీ పట్టించుకోడం లేదు. పెద్ద ప్రాజెక్టులకు కోటానుకోట్ల రూపాయలు దారపోస్తున్నారుగాని, గ్రామాల్లో చెరువులు తెగిపోయినా, బావులు ఎండిపోయినా వాటికిమాత్రం డబ్బుండదు. పెద్ద నీటివనరులకంటె కూడా చిన్న నీటి వనరుల విషయం ఎక్కువ శ్రద్ధ వహించాలి" అన్నారు.

ప్రభుత్వోద్యోగులలో అవినీతి నిర్మూలనకు గట్టి చర్యతీసుకోవాలని కోరారు.

## రాబడి మార్గాలు సూచించేందుకు సంఘం

శ్రీ ఎం. రాజేశ్వరరావు (కాం) ప్రభుత్వ ఖర్చులలో ఎక్కువ పొదుపు అవసరమని, ప్రభుత్వ రాబడి పెంచే మార్గాలను సూచించేందుకు శాసనసభ సభ్యులతో సంఘాన్ని నియమించాలని అన్నారు. కౌలుదారీచట్టం సంగతి చెబుతూ, యీ చట్టంవల్ల కౌలుదారులకు మేలుకన్నా కీడే ఎక్కువ జరుగుతోందని యీ చట్టాన్ని ప్రభుత్వం సక్రమంగా అమలుజరపాలని కోరారు.

శ్రీ కృష్ణమాచారి (స్వ) దుబారా ఖర్చులవల్ల, ప్రభుత్వ రాబడిలో లోటు రావడానికి కారణమని, అవినీతి నిర్మూలనకు ప్రభుత్వం గట్టి చర్య తీసుకోవాలని, వచ్చే డబ్బు సక్రమంగా ఖర్చు పెట్టేట్లు చూచేపక్షంలో, ప్రభుత్వం కొత్త పన్నులు వేసినా సంతోషంగా భరిస్తారని అన్నారు.

## వ్యవసాయాదాయపు పన్ను

శ్రీ దవార్ హుస్సేన్ (కాం) ఆంధ్ర తెలంగాణా ప్రాంతాల సంఘ సంక్షేమ చట్టాలను వెంటనే సమన్వయం చేయాలని అన్నారు. ఒకప్రాంతంలో ఎక్కువగాఉన్న పన్ను రేటును, అదనపు రాబడికోసమని యింకో ప్రాంతంలో ప్రవేశపెట్టతగదని, ప్రజల స్తోమతు గమనించకుండా, పన్నులలో యీరకమైన సమన్వయం అనుసరించడం సమర్థనీయమైన పనిగాదని, అందువల్ల ఎక్కువ రాబడికూడిరాదని, యిందుకు అమ్మకంపన్ను చట్టాల సమన్వయమే కారణమని ఆయన హెచ్చరించారు.

హైదరాబాదు భూమి సంస్కరణలలో లోపాలున్నప్పటికీ, వాటిని ఆంధ్రప్రాంతంలోకూడా అమలు జరపాలని ప్రస్తుతం తెలంగాణాలో అమలులోఉన్న వ్యవసాయాదాయపు పన్నును ఆంధ్రప్రాంతంలో కూడా వసూలుచేయాలని యీ పన్నును, పూర్వపు హైదరాబాదురాష్ట్రంలో కట్టుదిట్టంగా వసూలు చేయకపోవడంవల్లనే వసూలుఅయిన డబ్బు ఆట్టేలేదని శ్రీ హుస్సేన్ అన్నారు. తెలంగాణాలో రోడ్డు రవాణాపద్ధతిని ఆంధ్రలోకూడా ప్రవేశపెట్టే అవకాశం పరిశీలించాలని కోరారు.

## ధాన్యాలు, వ్యాపారపంటల విక్రయ సంఘం

శ్రీ మంతెన వెంకటరాజు (కాం) ఆహారధాన్యాలు, వాణిజ్యపంటల క్రయ విక్రయాలకు ప్రభుత్వమే ఒక సంస్థను పెట్టాలని సూచించారు. భూమి శిస్తుపై సర్చార్జివల్లగాని, యింకో అటువంటి పన్నులవల్లగాని ప్రభుత్వ ఆదాయం పెద్దగా పెరుగదన్నారు. సిమెంటు, ఉక్కు, ఇనుము-ఉక్కు పంపిణీని ప్రభుత్వమే నిర్వహించాలని, అలా చేసినట్లయితే ప్రజలకు ఇవి సరసమైన ధరలకు లభించడమే గాక, ప్రభుత్వానికి బోలెడంత లాభం మిగులుతుందని, కొత్త పన్నులు వేయడంకన్నా, జీవితావసర వస్తువులపై యిప్పుడున్న ధరలు పెంచేకన్నా, ప్రభుత్వం లోటు పూడ్చుకోడానికి యిది చక్కని పద్ధతి అని శ్రీ రాజు సూచించారు.

శ్రీ బి. శంకరయ్య (కమ్యూ) ప్రభుత్వపన్నుల విధానం పూర్తిగా మారాలన్నారు. "క్రితం కొద్ది సంవత్సరాలుగా ప్రతిపక్షం, ప్రభుత్వం రాబడి పెంచుకొనే మార్గాలు సూచిస్తునే ఉన్నది కాని ప్రభుత్వం మాత్రం వాటిని ఖాతరు చేయలేదు. రాష్ట్ర ఆదాయాన్ని పెంచే మార్పులు సూచించండి అని ఆర్థిక మంత్రి ఇప్పుడు సభ్యుల్ని కోరారు. ఈ సభలోని వివిధ పార్టీల సభ్యులతో సంఘాన్ని యేర్పాటుచేసి, రాబడి పెరిగే మార్గాలు సూచించమని ప్రభుత్వం కోరాలి" అని శ్రీ శంకరయ్య అన్నారు.

## ఆహారధాన్యాల ధరలు

శ్రీ జి. సూర్యనారాయణ (సో) ఆకాశమంటుతున్న ఆహారధాన్యాల సంగతి శ్రీ గోపాలరెడ్డి తమ ప్రసంగంలో ప్రస్తావించనందుకు విచారం వెల్లడించారు. విద్యావైద్య సదుపాయాలేమీ లేకుండా వెనుకబడిఉన్న గ్రామప్రాంతాల అభివృద్ధికి సమగ్రమైన కార్యక్రమం అవసరమన్నారు.

## తెలంగాణా అభివృద్ధి అవసరం

శ్రీ పి. వి. నరసింహారావు (కాం) వెనుకబడిఉన్న తెలంగాణప్రాంతాన్ని ఆంధ్రప్రాంతం స్థాయికివచ్చేట్లు అభివృద్ధి చేయాలన్నారు. "రాష్ట్రంలో ప్రజలందరూ సుఖంగా ఉండాలంటే యీ ప్రాంతపు వెనుకబడిన తనాన్ని పోగొట్టాలి. తెలంగాణాలో యింకా పన్నులు వేయడానికి అవకాశంలేదు. ఈ ప్రాంతంలో ఒకే ఒక పెద్ద నీటి వనరు ఉంది. అది నిజాం సాగర్. మరి కొన్ని నీటివనరులు ఇంకా పూర్తి కాలేదు. ఇవన్నీ అయి ఫలసాయం చేతికి రావడానికి యింకా ఒకటి రెండు దశాబ్దాలు పడుతుంది. కాబట్టి యిప్పుడు చేయాల్సింది మధ్యరకం నీటి వనర్లను ప్రారంభించడం. ఇటువంటివి కొన్ని వందలదాకా ఉన్నది. మరమ్మతు చేసి ఉపయోగంలోకి తేవాలి. యుద్ధకాలంలో పనులు ఎంత చురుకుగా చేస్తారో, ఆ మాదిరి యిప్పుడు చేసి కొద్ది ఏండ్లలో ఫలితం లభించేట్లు చూడాలి" అన్నారు.

ఆంధ్ర - తెలంగాణాలు రెండూ రెండు ప్రత్యేకప్రాంతాలుగా పరిగణించడం తనకు నచ్చదని, ఆంధ్రప్రాంతం ద్రవ్యమూ, తెలంగాణా ద్రవ్యమూ అన్న విచక్షణ లేకుండా, అవసరమైనంత ఖర్చు పెట్టాలని కోరారు.

ఖర్చులో చాలా వివక్షత చూపించారని, తెలంగాణాకు నాలుగోవంతు మాత్రమే కేటాయించారని ఆయన అనగా ఆర్థికమంత్రి శ్రీ గోపాలరెడ్డి కల్పించుకొని, అభివృద్ధి కార్యక్రమ ప్లానింగు కమిషనే ఖరారు చేసి పంపిందని చెప్పారు.

శ్రీ మాధవరావు (స్వ) అభివృద్ధి కార్యక్రమాలు సక్రమంగా అమలు జరుగుతున్నదీ లేనిదీ ప్రభుత్వం చూడాలన్నారు.

శ్రీ జె. చొక్కారావు తదుపరి బడ్జెటు చూచి ఆందోళనపడవలసిన అవసరం లేదని, తెలంగాణాకు ఎక్కువ డబ్బు కేటాయించాలని కోరారు.

అంతటితో సభ సోమవారంనాటికి వాయిదా పడింది.

# కృశ్చేవ్ ఆరోపణ

(1 వ పుట తరువాయి)

మొదలైనవి అధికంగా లభించవలసింది కాని, ఇవి సమృద్ధిగా లభించాలంటే, సోవియట్ ఆర్థిక వ్యవస్థ మాత్రం భారీ పరిశ్రమల అభివృద్ధిపై ఆధారపడక తప్పదని శ్రీకృశ్చేవ్ చెప్పారు.

## వ్యక్తిఆరాధన ఫలితాల నివారణకు ప్రతిఘటన

రష్యాలో వ్యక్తి ఆరాధన ఫలితాలను నివారించడానికి చేస్తున్న కృషిని మాలటోవ్ మాలెంకోవ్ కగనోవిచ్ వర్గం ప్రతిఘటించిందని, ప్రధాని శ్రీ బుల్గానిన్ లెనిన్‌గ్రాడ్ ఇంజనీరింగ్ కర్మాగారంలో ప్రసంగిస్తూ, ఆరోపించారు.

ఈ వర్గంలో మూడుసార్లు గెల్లుగా కమ్యూనిస్టుపార్టీ విధానాలను ప్రతిఘటిస్తున్నారన్నారు.

విప్లవాత్మకమైన సోవియట్ సామ్యవాద న్యాయశాసనాల అతిక్రమణ ఇదివరలో మాదిరిగా సంభవించకుండా చేస్తున్న కృషిని విరోధించ యత్నించారు.

పార్టీ నాయకవర్గంతో సంఘర్షణ సాగించి, పార్టీ విధానాలను వ్యతిరేకించి, అవి మార్చడానికి ఈ వర్గం ప్రయత్నించిందని శ్రీ బుల్గానిన్ అన్నారు.

పార్టీలో కక్షలు పుట్టించాలని ప్రయత్నించేవారు, చాటుమన్నాగాలు పన్నేవారు తగిన శిక్ష పొందారు, అని సోవియట్ యూనియన్ అధ్యక్షులు శ్రీ వోరోషిలోవ్, కిరోవ్ కర్మాగారంలో ప్రసంగిస్తూ అన్నారు.

పార్టీ నాయకత్వాన్ని హస్తగతం చేసుకోడానికి పార్టీ వ్యతిరేకవర్గం ప్రయత్నించిందన్నారు.

పార్టీ అధ్యక్షమండలి సభ్యత్వం పొందిన ఏకైక మహిళ శ్రీమతి కొతరీనా ఫుర్త్‌సేవా, లెనిన్‌గ్రాడ్‌లో ఒక వస్త్ర కర్మాగారంలో ఉపన్యసిస్తూ, దేశాభివృద్ధి సక్రమమార్గంలో కొనసాగకుండా నిరోధించారని ఆరోపించారు.

లెనిన్‌గ్రాడ్ సంఘటనలకు మాలెంకోవ్ కారకుడని, కొత్తగా అధ్యక్షమండలిలో పూర్తిసభ్యత్వంపొందిన శ్రీ నికొలాయ్ ష్వెర్నిక్ ఆరోపించారు.

[1948-49 లో లెనిన్‌గ్రాడ్ పార్టీని బలహీనపరచాలనే ఉద్దేశంతో కొంతమందిపై లేనిపోని నేరాలు మోపి, బెరియా, అబాకుమోవ్‌లు నిర్బంధంలో పెట్టించారట. ఇందుకు, ఇతర నేరాలకు వీరిద్దరినీ తరువాత ఉరితీశారు. ఆపైన అమాయకుల నిర్దోషిత్వాన్ని పార్టీ ప్రకటించింది.]

# మాలటోవ్ వర్గాన్ని నిర్బంధంలో ఉంచలేదు

లండన్, జూలై 6: రష్యా కమ్యూనిస్టుపార్టీలోనూ, ప్రభుత్వంలోనూ పదవులు కోల్పోయిన మాలటోవ్ మాలెంకోవ్ మొదలైన వారిని, వారి నివాస గృహాలలోనే నిర్బంధంలో ఉంచారని పాశ్చాత్య పత్రికలు ప్రచురించిన వార్తలను, మాస్కో రేడియో ఇవాళ అధిక్షేపించింది.

మాలెంకోవ్, మాలటోవ్, కగనోవిచ్, ముగ్గురూ నిన్న నే స్థానికమాస్కో పార్టీ సమావేశాలకు, వీలాసాగా వీధిలో నడిచి వెళ్ళగా చూసినవారు, పాశ్చాత్యుల అపప్రచారాలకు నవ్వుకుంటున్నారట.

పార్టీ అధ్యక్ష మండలి నుంచి వెలివేసి వెళ్లగొట్టుతూ కేంద్రసంఘం చేసిన నిర్ణయాన్ని, సోవియట్ కార్మిక సంఘ మండలి బలపరుస్తూ ప్రకటన చేసిందని, టాస్ వార్తా సంస్థ తెలుపుతున్నది.

షెపిలోవ్ కపట స్వభావాన్ని సోవియట్ రచయితల సంఘం పత్రిక తెగనాడింది.

ఇదివరలో శాస్త్రీక సమస్యలను పార్టీ షెపిలోవ్‌కు అప్పగించింది.

ఈనాటికీ సోవియట్ రచయితలలో, ప్రజల జీవితంనుంచి దూరమైపోయిన వారు కొందరున్నారని ఆ పత్రిక వ్రాసింది.

# రష్యాలో మళ్లీ కొద్ది మందినియంతృత్వం

## పాశ్చాత్యుల అభిప్రాయం పట్ల హేళన

కృశ్చేవ్ పంథాను ప్రతిఘటించిన వారిని పార్టీ నాయకత్వం నుంచీ, ప్రభుత్వం నుంచీ తొలగించడంతో, రష్యాలో తిరిగి కొద్దిమంది వ్యక్తుల నియంతృత్వం ఏర్పడినట్లే, అని పాశ్చాత్య పరిశీలకులు వెలిబుచ్చిన భావాలను ఇవాళ మాస్కో రేడియో హేళనచేసింది. ఇటువంటి పరిశీలకులకు సామ్యవాదవ్యవస్థ అంటే ఏమిటో అర్థంకాదు. ఈ వ్యవస్థలో అదృష్టవంతులు దురదృష్టవంతులు అనే తేడా ఉండదు, అని ఈ రేడియో వ్యాఖ్యానించింది.

నియంతృత్వం అంటూ అభూత కల్పనలుచేసే ఈ వర్గాలు మాలెంకోవ్ పట్ల చూపుతున్న కపట సానుభూతికి విలువెంత? అన్నది. ఆ వర్గంలో మాలెంకోవ్ దోషం తక్కువనీ, ఇతరుల దోషం ఎక్కువనీ ఏవేవో చెపుతున్నారు. వాస్తవానికి అందరూ సమాన దోషులే, అని మాస్కో రేడియో అన్నది.

# కృశ్చేవ్ అధికారం ఎక్కువైనట్లుంది

లండన్, జూలై 6: క్రెమ్లిన్ అధికార వర్గంలో మార్పుల మూలంగా, కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శి శ్రీ కృశ్చేవ్ అధికారబలం పెరిగినట్లు కనపడుతుంది. అని బ్రిటిషు విదేశాంగ మంత్రి శ్రీ సెల్విన్‌లాయిడ్ అన్నారు. అంతర్జాతీయ వ్యవహారాలలో ఈ మార్పు ప్రభావం ఎలా వుంటుందో వేచి చూడవలసిందే అన్నారు.

రష్యాకు చెందిన నేల అంగుళం కూడా బ్రిటన్ కావాలని కోరుకోడం లేదు; ఎవరి మానాన వారు బ్రతకడమే కోరుకుంటున్నదన్నా, అన్నారు.

బ్రిటిషు అధికార వర్గాలలో ఈ మార్పుల ఫలితాలను వేచి చూడవలసిందనే ధోరణి అధికంగా కనపడుతోంది.

అయినే రష్యాపట్ల నిష్ఠురంగా అతి కఠినంగా వ్యవహరించడం మేలుకాదని మాత్రం ఒక అభిప్రాయం సామాన్యంగా కనపడుతోంది. ఇకమీదట అంతర్జాతీయ వైమనస్యాలు తగ్గుతాయనే ఆశాభావాన్ని బ్రిటిషు పత్రికలు వెలిబుచ్చాయి.

క్రెమ్లిన్‌లో అధికారం ఎవరిచేతులలో ఉండనీ, సోవియట్ ప్రజలు యుద్ధ భీతినుండి విముక్తి కలిగించవలసిన పెద్దబాధ్యత పాశ్చాత్య రాజ్యాలపై ఉన్నదని, "డైలీ హెరాల్డ్" వ్రాసింది. అప్పుడే, సోవియట్ సమాజ జీవనంలో కఠోర లక్షణాలు తొలగిపోయి, క్రమేణా అక్కడ ఉదార బుద్ధితో పరిపాలన సాగడానికి వీలుంటుందనికూడా వ్రాసింది.

# నెహ్రూ శాంతికృషి ఫలానికి నిదర్శనం

సోవియట్ యూనియన్‌లో అధికార నిర్బంధం పడలవలసినఅవసరాన్ని సడలించడం, నెహ్రూ శాంతి కృషిఫలానికి ఒకవిధమైన నిదర్శనం అని కామన్వెల్తు వర్గాలలో కొందరు అభిప్రాయ పడుతున్నారు. ఈసందర్భంలో యూరోపియన్ నాయకులతో నెహ్రూసాన్నిహిత్యం అత్యంత ప్రధానం, అనుకుంటున్నారు.

# రెవెన్యూమంత్రి కార్యక్రమం

హైదరాబాదు, జూలై 6: రెవెన్యూ మంత్రి శ్రీ కళా వెంకటరావు 9వ తేదీ మధ్యాహ్నం 2 గంటలకు విమానంలో మద్రాసు వెడతారు. జూలై 11వ ప్రారంభమయ్యే దక్షిణ ప్రాంతీయ మండలి సమావేశంలో పాల్గొని 12వ తేదీకి తిరిగి వస్తారు.

Printed and Published for Nageswara Rao Estate (private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1, Editor S. Sambhuprasad.

# ప్రభుత్వ అధ్వర్యంలోని పరిశ్రమల తీరుతెన్నులు

## ఆయవ్యయాల వివరాలు

హైదరాబాదు, జూలై 6:— రాజమండ్రిలోని ప్రభుత్వ కాగితాల పరిశ్రమ, గూడూరులోని ప్రభుత్వ పింగాణీ పరిశ్రమ, గాజుపరిశ్రమల ఆయ వ్యయాల వివరాలను 1957-58 బడ్జెట్ అంచనాలతోపాటు శాసనసభ సభ్యులకు ప్రభుత్వం నిన్న అందజేసింది.

రాజమండ్రిలోని ఆంధ్ర పేపరు మిల్స్ (ప్రభుత్వ నిర్వహణలోని పరిశ్రమ) 1950-51, 1951-52 సంవత్సరాలలో ఆర్థికంగా లాయకీగానే పనిచేసింది. కాని, ఆతరువాతి సంవత్సరాలలో యీ పరిశ్రమ పరిస్థితి అంత సంతృప్తికరంగా లేదు. ముడివస్తువులు దుబారా కాకుండా చూచేందుకు రు 28,300 ఖర్చున అట్టలను తయారుచేసే ఒకపథకాన్ని మంజూరు చేశారు. యంత్రాలలో అవసరమైన మార్పులు చేసి, ఆదివరకటికంటే రెట్టింపు సరుకు అక్కడ తయారయ్యే ఏర్పాట్లు చేయడం అవసరమనికూడా భావించారు. అందుకు 1955-56 లో రు 1630 వేలు మంజూరు చేశారు. ఆంధ్ర పేపరు మిల్సు అభివృద్ధికి వినియోగపడే 175 లక్షల పథకాన్ని రెండవ పంచవర్ష ప్రణాళికలో చేర్చవలసిన సంగతి ఆలోచించవలసినదిగా ప్లానింగ్ కమీషన్ను కోరడం జరిగింది. ఆ ప్రతిపాదనను ప్లానింగ్ కమిషన్ ఆమోదించింది. ఆమిల్లులో అట్టలను తయారుచేసే విభాగం బాగా పనిచేసింది; రు 90,945 నికరలాభం వచ్చింది. కరువుభత్యంతో సహా ఒకనెల వేతనం 1956-57 వ సంవత్సరానికి ఆపరిశ్రమలోని పనివారికి బోనసుగా ప్రభుత్వం మంజూరు చేసింది.

ఆదివరకటికంటే ఎక్కువ వస్తువులను తయారు చెయ్యడానికి వినియోగపడే కొత్తయంత్రాలను నెలకొల్పి గూడూరు పింగాణీ వస్తువుల ఫ్యాక్టరీని పునర్వ్యవస్థీకరించారు. ఈ ఫ్యాక్టరీకి అదనంగా అవసరమైన భవనాలను నిర్మించేందుకు 1955-56 లో రు 38 లక్షలు మంజూరు చేశారు. అదనపు యంత్రాలు కొనడానికి మరో రు 60 వేలుకూడా మంజూరుచేశారు. 1955-56 లో ఈ ఫ్యాక్టరీకి రు 27,699 నికరలాభం వచ్చింది. కరువుభత్యంతో సహా ఒకనెల వేతనం బోనస్ను ఆఫ్యాక్టరీ పనివారికి ఆ సంవత్సరానికి ప్రభుత్వం మంజూరుచేసింది.

పోతే గూడూరు గాజు సామానుల ఫ్యాక్టరీని రు 1,75,000 ఖర్చుతో ఏర్పాటుచేశారు. 1955 మేలో యీ పరిశ్రమ పని ప్రారంభించింది. 1956 మార్చి 31 తో అంత్యమైన సంవత్సరంలో యీపరిశ్రమకు రు 71,184 నష్టం వచ్చింది; నికర నష్టం రు 48,885 యీ ఫ్యాక్టరీ అంత సంతృప్తికరంగా పని చెయ్యనట్టు తోచనందున, ఆ ఫ్యాక్టరీకి అవసరమైన గాజు పరిశ్రమ నిపుణుని నియామకం జరిగే వరకూ ఫ్యాక్టరీపని తాత్కాలికంగా ఆపివేశారు.

### చోడవరం పంచదారఫ్యాక్టరీ

సహకార పద్ధతిన పంచదారఫ్యాక్టరీ నిర్వహించడానికి అవసరమైన వాటాధనం వసూలు చేసుకొనేందుకు చోడవరం, వ్యవసాయ పారిశ్రామిక సహకార సంఘానికి అనుమతి ఇవ్వడమైందని, శ్రీ సంజీవరెడ్డి చెప్పారు.

పంచదార ఫ్యాక్టరీలు పెట్టుకోడానికి కేంద్ర ప్రభుత్వమే అనుమతులు ఇస్తుందని అయితే రాష్ట్రప్రభుత్వం సిఫార్సు చేసే సహకార సంఘాలకు ఇలా అనుమతులు ఇవ్వడం మామూలుగా జరుగుతుందని ముఖ్య మంత్రి చెప్పారు.

### చెరుకు పరిశోధనకు 237 వేలు ఖర్చు

1953 నుంచి 56 వరకూ పంచదార చెరుకు పరిశోధన నిమిత్తం, సెస్సునిధి నుంచి రు. 237 వేలు ఖర్చు పెట్టడమైందని తెలంగాణాలో 1945 నుంచి 56 వరకు రు. 140 లక్షలు ఖర్చు అయిందని వ్యవసాయ మంత్రి శ్రీ తిమ్మారెడ్డి చెప్పారు. తెలంగాణాలో ఖర్చుపెట్టిన ఈ డబ్బు, ప్రభుత్వాదాయం నుంచి ఖర్చు చేయడమైందని, అక్కడ సెస్సు నిధిని ప్రత్యేకంగా ఉంచే ఏర్పాటు లేదని శ్రీ తిమ్మారెడ్డి వివరించారు. సెస్సు నిధినుంచి కొంత, ఫీడర్ రోడ్లకు ఖర్చు పెట్టాలని కూడా ఉద్దేశ్యం, అయితే యింతవరకు అందుకోసం యేమీ ఖర్చుచేయలేదు. కారణం ఇంతవరకు కేంద్రప్రభుత్వము పంచదార ఫ్యాక్టరీల యజమానులు యీరోడ్లకోసం విరాళాలు యివ్వకపోవడమేనని వ్యవసాయ మంత్రి చెప్పారు. సభ్యుల ప్రశ్నలకు సమాధానమిస్తు, ఫీడర్ రోడ్లకు సెస్సు నిధి వినియోగంలో యిక ఆలస్యమేమీ లేకుండా చూస్తానని హామీ ఇచ్చారు.

### ఆంధ్ర తెలంగాణాల గ్రంథాలయ చట్టాలు

ఆంధ్ర - తెలంగాణాలలో అమలులో ఉన్న గ్రంథాలయాల చట్టాలను త్వరలోనే సమన్వయం చేయాలని ప్రభుత్వం సంకల్పించిందని రాష్ట్ర విద్యాశాఖమంత్రి శ్రీ ఎస్. బి. పి. పట్టాభిరామారావు ఇవాళ శాసనసభలో తెలియచేశారు.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య ప్రశ్నకు సమాధానమిస్తూ, ఇటీవల గ్రంథాలయాల ప్రతినిధులసమావేశంలో రాష్ట్రంలో గ్రంథాలయాల నిర్వహణ ప్రస్తుతకాలానికి తగ్గట్టుగా ఉండేట్టు చట్టంలో అవసరమయిన మార్పులు సూచించేందుకని ఒక ఉపసంఘాన్ని నియమించినట్లువిద్యామంత్రి చెప్పారు. మరోప్రశ్నకు బదులు చెబుతూ, చిన్న పంచాయతీలలో గ్రంథాలయాలు ఏర్పాటుచేసే ఆలోచన ప్రభుత్వానికి లేదన్నారు.

ఉపసంఘం సిఫార్సులు అందిన తరువాత, గ్రంథాలయాల పునర్నిర్మాణాన్ని, నెలజీతాలపై గ్రంథాలయ నిర్వాహకులను నియమించే విషయాన్ని ప్రభుత్వం ఆలోచిస్తుందని శ్రీ పట్టాభి రామారావు చెప్పారు.

శ్రీ కె. ఆర్. కృష్ణయ్య చెట్టి: హిందూపురం పురపాలక సంఘాధ్యక్షులుగా ఎన్నికైనారు.

### బోధన్ పంచదార ఫ్యాక్టరీ కార్మికులు

కార్మిక, సంఘ సంక్షేమ శాఖల మంత్రి శ్రీ డి. సంజీవయ్య, యిటీవల బోధన్ పంచదార ఫ్యాక్టరీలో పని నుండి తొలగించిన 250 మంది కార్మికుల లోనూ చాలామందిని మళ్ళీ పనిలోకి చేర్చుకోవడం జరిగిందని చెప్పారు. పంచదార ఉత్పత్తి ఋతువులో పనిచేసే కార్మికులు వీరంతా.

పంచదార ఫ్యాక్టరీ కార్మికసభ తరఫున ఒక రాయబారవర్గం కొన్నాళ్ళ క్రితం తనను కలుసుకొని, కార్మికుల సాధకబాధకాలను నివేదించిందని, ఆతరువాత, లోగడ పనినుండి తొలగించిన వారిలోచాలామందిని మళ్ళీ పనిలోకి చేర్చుకోవడం జరిగిందని శ్రీ సంజీవయ్య తెలియజేశారు.

### శ్రీహరికోట అడవిఅభివృద్ధి

నెల్లూరుజిల్లాలోని శ్రీహరికోట అడవిని అభివృద్ధిచేసే పని ప్రభుత్వం యిదివరకే ప్రారంభించిందని వ్యవసాయ మంత్రి తిమ్మారెడ్డి చెప్పారు. ఇప్పటికి 2500 ఎకరాలలో సరుగు,వెదురు,సీమ మొక్కలను నాటారని మంత్రి తెలియజేశారు.

శ్రీహరికోట ప్రాంతాన్ని మన్య ప్రాంతంగా పరిగణించాలనే ఆలోచన ప్రభుత్వానికి లేదని కార్మిక మంత్రి శ్రీ డి. సంజీవయ్య చెప్పారు. అయితే, ఆప్రాంతానికి స్వయంగా వెళ్ళి, అలా మన్యప్రాంతంగా పరిగణించడానికి ఏమైనా వీలువున్నదేమో చూస్తానని, హామీ ఇచ్చారు.

మన్య ప్రాంతంగా పరిగణించినట్లయితే, ఆప్రాంతం అభివృద్ధికి కేంద్రం నుండి ధనసహాయం పొందే వీలు కలుగుతుంది.

### పేదలకు హరిజనులకు భూములు

అనంతపురం తాలూకా కొండాపూరు వగైరా కొన్ని గ్రామాలలో 185 మందికి వ్యవసాయభూములకు పట్టా లివ్వడమైందని, వారిలో 77 మంది హరిజనులని, రెవెన్యూ మంత్రి శ్రీ కళా వెంకటరావు చెప్పారు. మరికొన్ని ప్రశ్నలకు సమాధానమిస్తూ, గ్రామాలలో హరిజనులకు, భూములు లేని పేదలకు, భూమి లివ్వడమే మామూలుగా ప్రభుత్వ విధానమని మంత్రి అన్నారు.

విశాఖపట్టణం శ్రీకాకుళం జిల్లాలను 3 జిల్లాలుగా విభజించే ఆలోచన ఏమైనా ఉన్నదాఅని శ్రీ పి.సుబ్బయ్య అడుగగా అలాంటిదేమీ లేదని రెవెన్యూ మంత్రి చెప్పారు.

### రిజిస్ట్రేషన్ స్టాంపులు

హాలీ సిక్కానుంచి, భారత ద్రవ్యమానంలోకి మారడంవల్ల, తెలంగాణ ప్రాంతంలో రిజిస్ట్రేషన్ స్టాంపుల కొరత యేర్పడిందనీ యీ కొరత నివారించడానికి చర్యలు తీసుకొంటున్నామని, హైదరాబాదులో స్టాంపుముద్రణాలయం హాలీసిక్కాకు సంబంధించిన దవడంచేత, నాసిక్ లోని కరెన్సీముద్రణాలయాన్ని అడుగవలసి వచ్చిందని, రెవెన్యూమంత్రి చెప్పారు.

# తుంగభద్ర ఎగువ కాల్వ

## మొత్తం 2535 లక్షలు ఖర్చవుతుందని అంచనా

హైదరాబాదు, జూలై 6: రాష్ట్ర ప్రభుత్వ నీటిపారుదల, విద్యుచ్ఛక్తిశాఖ మంత్రి శ్రీ కె. వి. నరసింగరావు, ఇవాళ శాసనసభలో శ్రీ ఎస్. కాశిరెడ్డి ప్రశ్నకు సమాధానమిస్తూ, తుంగభద్ర ఎగువకాల్వకు మొత్తం 25 కోట్ల 35 లక్షలు ఖర్చుఅవుతుందని చెప్పారు. తాలూకా వారీగా ఆయకట్టువివరాలు ఇంకా ఖరారు కాలేదని అన్నారు.

మరికొన్ని ప్రశ్నలకు ముఖ్యమంత్రి జవాబిస్తూ, ప్లానింగుకమిషన్ ఆమోదం వచ్చే లోగా రాష్ట్ర ప్రభుత్వం యీ కాల్వకు, కాల్వక్రింద ఆయకట్టు సిద్ధం చేసేందుకు 50లక్షలు ఖర్చు పెడుతోందని తెలియజేశారు.

# ఆంధ్రప్రదేశ్ ఎగువ శాసనసభ

## పట్టభద్రుల నుంచి వివరాల సేకరణ

హైదరాబాదు, జూలై 6: ఆంధ్రప్రదేశ్ ప్రధాన ఎన్నికల అధికారి ఈ దిగువ ప్రకటన చేశారు.

ఆంధ్రప్రదేశ్ యెగువ శాసనసభను యేర్పాటుచేసే విషయాన్ని ఇప్పుడు కేంద్రప్రభుత్వం పరిశీలిస్తున్నది. భారత రాజ్యాంగం ప్రకారం యీ రాష్ట్రానికి ఏర్పాటు కాబోయే ఎగువ శాసనసభ సభ్యులలో పన్నెండింట ఒకవంతు పట్టభద్రులచే యెన్నికవుతారు. భారత దేశంలోని యే విశ్వవిద్యాలయం నుంచైనా అథమం మూడు సంవత్సరాల క్రితం డిగ్రీ తీసుకుని యీ రాష్ట్రంలో వుండే పట్టభద్రులు సభ్యులను యెన్నుకోవచ్చు. అటువంటి విశ్వవిద్యాలయందేనినుంచైనా పొందిన డిగ్రీతో సమానమైనదని పార్లమెంటు శాసనం ప్రకారం నిర్ణయమైన అర్హతలను అథమపక్షం మూడు సంవత్సరాలనుంచి కలిగివున్నవారు కూడా సభ్యులను యెన్నుకోవచ్చు. ఆంధ్రప్రదేశ్ ప్రతి జిల్లాలోను నివసించే అట్టి పట్టభద్రుల వివరాలను తక్షణం సేకరించవలసివుంది. కాబట్టి 1-1-58 నాటికి మూడు సంవత్సరాల క్రితం పట్టభద్రులయి యీ రాష్ట్రంలో నివసిస్తున్న వ్యక్తులందరూ తమతమ పేర్లు, చిరునామాలను ఆయా జిల్లా కలక్టర్లకు 31-7-57 కు పూర్వం తెలియచేయాలి. డిగ్రీ తీసుకున్న తేదీ, డిగ్రీ వివరాలు కూడా తెలియచేయాలి. 1-1-58 నాటికి మూడు సంవత్సరాల నుంచి అనుబంధంలో నిర్దేశించిన అర్హతలు గలవారు కూడా తమతమ పేరువగైరా వివరాలను తెలియచేయాలి.

అనుబంధం:- డిగ్రీ. ఏ. ఇంగ్లండు యితర కామన్వెల్తు దేశాలు, ఐరిష్ స్వతంత్ర రాజ్యాలలోని విశ్వవిద్యాలయాలు యిచ్చిన డిగ్రీలు; (అయితే ఆ విశ్వవిద్యాలయాలు ఆయాదేశ ప్రభుత్వాలచే గుర్తించబడినవై వుండాలి.)

బి. ఫ్రెంచి, జర్మన్, అమెరికన్ విశ్వవిద్యాలయాలు యిచ్చిన డిగ్రీలు. ఆ విశ్వ విద్యాలయాలు ఇండియా అంతర్ విశ్వవిద్యాలయం బోర్డుచే ఆమోదింపబడినవై వుండాలి.

ఇతర అర్హతలు. భారతదేశంలో ఎ. ము. ఐ. సి. ఇ; ఎ. ము. ఐ. ఇ; ఎ. ము. ఐ. ఎమ్. ఇ; ఇంజనీర్ల సంస్థ డిగ్రీలు ఎమ్. సి. సి. ఎస్. (వైద్యంలో) మద్రాసు రాష్ట్రంలోని విశ్వ విద్యాలయాలు, యితర విద్యాసంస్థలుభాషలు లేక సంగీతంలో ఇచ్చిన బిరుదులు. పై సంస్థలు మద్రాసు ప్రభుత్వంచే గుర్తించ బడినవై వుండాలి. ఈ కోర్సులను రెండు సంవత్సరాలకు తక్కువ కాకుండా చదివి వుత్తీర్ణులై వుండాలి.

అడ్వొకేటు లేక హైకోర్టుఅటార్నీ ఎన్రోలు మెంటు:—

ఎల్. ఎమ్. అండ్ ఎస్; ఎల్. ఎమ్. సి; డి. ఎమ్. ఎస్; జి. సి. ఐ. ఎమ్; ఎల్. ఐ. ఎమ్; హెచ్. పి. ఐ. ఎమ్; (మద్రాసు రాష్ట్రానికి.)

బి. ఇతరదేశాలలో :—ఇంగ్లండు, యితర కామన్వెల్తు రాజ్యాలలోని రాయల్ కాలేజీలలోని వివిధ ఫేకల్టీలలో ఫెలోషిప్పులు, మెంబరుషిప్పులు. ఇంగ్లండు లేక ఐర్లండులో బారిస్టరుగా లేక స్కాట్లండులో అడ్వొకేట్ల ఫేకల్టీ సభ్యుడుగా ఎన్రోలు కావడం.

స్నాతకోత్సవంలో డిగ్రీలు యివ్వబడిన తేదీనుంచి ఒక వ్యక్తి పట్టభద్రుడైనట్టు (విశ్వవిద్యాలయం నిబంధనల ప్రకారం అందుకు వీలులేని అరుదైన సందర్భాలలో తప్ప,) పరిగణింపబడుతుంది.

ఇండియా మెడిసిన్ ప్రైవేటు సంస్థలనుంచి పొందిన అర్హత జి. ఎమ్. బి. సి. కాని లేక డిప్లొమాలుకాని తగివున్నవారు, మద్రాసు విశ్వవిద్యాలయం యిచ్చిన అయుర్వేదశిరోమణి డిప్లొమా కాని వున్నవారు ఎన్రోలు మెంటుకి అర్హులు కారు.

### శ్రీ మాల్కం మాక్డొనాల్డ్

హైదరాబాదు, జూలై 6: భారతదేశంలోని బ్రిటిష్ హైకమిషనర్ శ్రీ మాల్కం మాక్డొనాల్డ్ నాలుగురోజుల పాటు యిక్కడఉండి యీ ఉదయం విమానంలో ఢిల్లీ వెళ్లారు.

# బస్సు యజమానుల చర్యలవలన నష్టం

## రోడ్డు రవాణా నిబంధనల అతిక్రమణలు

['ఆంధ్రపత్రిక' ప్రతినిధి]

హైదరాబాదు, జూలై 6: ఆంధ్రప్రదేశ్ లో 1957-58లో రోడ్డు రవాణా క్రింద రాబడి, ఖర్చు అంచనాలను రూపొందించారు. మొత్తం 549 బస్సులు 91 ఇతర శకటాలువున్నాయి.

సుమారు 17133000 మైళ్లు వివిధ మార్గాలలో బస్సులు, ఇతర శకటాలు తిరగగలవని అంచనా వేశారు. అయితే 1955-56 లో 16051923 మైళ్ళు మాత్రమే ఇవి తిరిగినవి. తేడా 1082000. ఈ తేడా రావడానికి రెండు కారణాలున్నాయి.

నగరంలో తిరిగే బస్సుల ట్రిప్పుల సంఖ్య హెచ్చించే వుద్దేశం వున్నందున 7 లక్షల మైళ్లు అదనంగా లెక్కవేశారు. పోతే తరిమా 382 వేల మైళ్లు అదనంగా చేరడానికి కారణం 1956-57 కొన్ని రవాణా మార్గాలను ప్రభుత్వం వశం చేసుకోవడమే.

హైదరాబాదు విభజన మూలంగా ఆంధ్రకు 525 బస్సులు 91 ఇతర శకటాలు లభించాయి. మరో 40 బస్సుల తయారీకి ఏర్పాట్లు చేశారు. ఇందులో 24 మునుపు కేటాయించారు. దీనితో మొత్తం 549 అయినది.

ఇక ప్రయాణీకుల రాకపోకల మూలంగా 1957-58 లో రు.19095000 లభించగలదని అంచనా వేశారు. అయితే తెలంగాణా ప్రాంతంలో 1955-56లో రు. 18324000 వసూలైనది. 1956-57 లో స్వాధీన పర్చుకున్న క్రొత్త మార్గాలద్వారా రు 257 వేలు అదనంగా రాగలదని అంచనా వేశారు.

చిల్లర రాబడులు రు 169 వేలు వుంటాయని అంచనా. ఇక అయ్యే ఖర్చు 1957-58 లో రు 175 లక్షలు.

బస్సు యజమానులు నిబంధనల నుల్లంఘించిన కారణంగా రవాణా నష్టమై ప్రభుత్వానికి రు 6 లక్షలు రాబడికూడా నష్టమైనది. దీనిని అదుపులో వుంచకపోతే రాబడి ఇంకా తగ్గగలదు.

ప్రభుత్వం మంజూరు చేసిన ప్రకారం ఖర్చు 1957-58 లో దిగువ విధంగా వుండగలదని అంచనా వేశారు.

పెట్టుబడి ఖర్చు రు 22 లక్షల 72 వేలు. క్రొత్త బస్సుల కొనుగోలుకు రు 16 లక్షల 22 వేలు అవుతుంది. ఇది యంత్రాలు, సామగ్రి, వగైరా అరిగిపోయినా, పాతబడినా, క్రొత్తవిఏర్పాటు చేసేందుకు కేటాయించిన విధినుంచి వినియోగించాల్సివున్నది. ఈనిధిమొత్తం 16 లక్షల 57 వేలు. అమలు జరుగుతున్న పనులకు రు 14 లక్షల 63 వేలు ఖర్చవుతాయి. ఈమొత్తంలో ముషీరాబాదులో రెండవసీ గదులుండే షెడ్డులు 300 కొనుగోలు చేయడానికి రు 12 లక్షలు ఖర్చు చేయాలి. వేరే రు. 195 వేలు క్రొత్త పనులకు ఖర్చు చేయాలి,

# "ప్రజల అవసరాలను కూడాగమనించండి"

## వర్తకులకురఘురామయ్య విజ్ఞప్తి

గుంటూరు, జూలై 4: వ్యాపారంతో పాటు ప్రజల అవసరాలను కూడా దృష్టిలో పెట్టుకొనవలసినదిగా పట్టణంలోని నెయ్యివర్తకులకు రక్షణశాఖ ఉపమంత్రి శ్రీ రఘురామయ్య విజ్ఞప్తి చేశారు. నెయ్యివర్తకుల కోరికలను అందులకు సంబంధించిన అధికారులకు తెలియ చేస్తానని హామీ ఇచ్చారు. పట్టణ వాణిజ్య మండలి తరఫున కేంద్ర ఉపమంత్రికి శ్రీ మద్ది సుదర్శనం స్వాగత వినతి పత్రం సమర్పించారు, నేతి వర్తకుల కోరికలను వివరించుచూ ఆ సంఘం కార్యదర్శి శ్రీ విష్ణుపాల్ విజ్ఞప్తిని సమర్పించారు.

కల్తీలేని నెయ్యి అమ్మి ప్రజల సానుభూతిని సంపాదించ వలసినదిగా వర్తకులకు శ్రీ వీకో ఆంజనేయులు విజ్ఞప్తి చేశారు. శ్రీ నెల్లూరుల జాలయ్యకూడా ప్రసంగించిన తరువాత శ్రీ పి. మృత్యుంజయరావు వందన సమర్పణ చేశారు.

### విలేఖరుల విందు

శ్రీ రఘురామయ్య గౌరవార్థం గుంటూరులోని పత్రికల విలేఖరులు విందుచేశారు.

గుంటూరులోని కొత్తపేట, రైలుపేట తదితర ప్రాంతాలను కూడా కేంద్ర ఉపమంత్రిచూచారు,

కొరిటపాడులో శ్రీ రఘురామయ్య గౌరవార్థం శ్రీ కె. సీతారామయ్య విందుచేశారు. సభకు శ్రీ కొమ్మారెడ్డి వెంకటరెడ్డి అధ్యక్షత వహించారు. శ్రీయుతులు నారాయణస్వామి, సీతారామయ్యగారలు ప్రసంగించారు.

ప్రజలతో కలసి మెలసి తిరిగి వారికి సౌకర్యాలకోసం కృషిచేయుటంద్వారా కాంగ్రెసు సంస్థకు బలం సమకూర్చవలసినదిగా శ్రీ రఘురామయ్య కాంగ్రెసు కార్యకర్తలకు విజ్ఞప్తి చేశారు.

# ద॥ ఆహార మండలం నిర్మాణం

## ధరలను అదుపు చేయటానికి కేంద్రం చర్యలు

మదరాసు, జూలై 7: కేంద్ర ఆహార శాఖ ఆంధ్రప్రదేశ్, మదరాసు, మైసూరు, కేరళ రాష్ట్రాలను కలిపి ఒక ఆహార మండలంగా ఏర్పాటు చేస్తూ ప్రకటన జారీ చేయగలదని తెలుస్తోంది.

ఇటీవల హైదరాబాదులో యీ నాలుగు రాష్ట్రాల ఆహార మంత్రులు సమావేశమై దక్షిణ ప్రాంతానికి ఆహార మండలం ఏర్పాటు చేయాలని నిర్ణయించిన విషయం తెలిసిందే.

ఆ ప్రకటనలో ఆహారమండలం పని చేయవలసిన విధానం, మండలానికి బయటి ప్రాంతాలకు ఎగుమతుల కట్టుబాట్లు, మండలంలో ధరలను సరసంగా వుంచుటకు సంబంధించిన ఏర్పాట్లు వుంటాయి.

మండలంలో ఒక రాష్ట్రంనుంచి మరొక రాష్ట్రానికి, ఉత్పత్తి కేంద్రాల నుండి మండలంలోని తరుగు ప్రాంతాలకు బియ్యం రవాణా ఎలా జరుగుతున్నది ధరవరలు ఎలావుంది అడపాదడపా పరిశీలించేందుకుకూడా ఏర్పాట్లు వుంటాయి. ఇందుకు యీ నాలుగు రాష్ట్రాల ప్రతినిధులు, కేంద్ర ఆహార శాఖ ప్రతినిధితో ఒక సంఘం ఏర్పాటు అవుతుంది.

జూన్ 6 తేదీకి పూర్వపు మూడు మాసముల సగటు ధర పైనా రూపాయికి మించి పెరిగి నప్పుడు సరుకును స్వాధీనం చేసుకునే అధికారం ప్రభుత్వాలకు ఇస్తున్నారు. ఈ సగటు ధర మణుగు బియ్యానికి రు. 18 ల వరకు వుండవచ్చని అంచనా. గణాంక డైరక్టరును ధరవరల ప్రకటనాధికారిగా నియమించారు.

ధరలను అదుపులో వుంచే ఉద్దేశ్యంతో సరుకును స్వాధీనం చేసుకునే అధికారం ప్రభుత్వాలకు ఇవ్వటం జరుగుతూ వుందని తెలుస్తోంది.

సరుకును స్వాధీనం చేసుకొనుటకు అయ్యే ఖర్చును కేంద్ర ఆహార మంత్రి వర్గమే భరిస్తుంది. సరుకును వారి తరఫునే నిల్వ చేస్తారు.

అమలాపురం, జూలై 1: యోగానంద ఆంధ్రరామాయణాది శతాధిక గ్రంథకర్త శ్రీ చిల్లరిగి యోగానందయ్య పంతులు నిన్న ఇక్కడ మరణించారు.

చనిపోయేసరికి వారివయస్సు 75 సంవత్సరాలు, ఆయనకు ఇద్దరు కుమారులు, ఇద్దరుకూతుళ్లు అనేకమంది బంధువులు ఉన్నారు. (స్వ. వి.)

# ఈయేడు స్కూల్ఫైనల్ తప్పిన విద్యార్థులు

## హిందీ మినహాయింపు సౌకర్యం ఇవ్వాలని విజ్ఞప్తి

భీమవరం, జూలై 6: ఈయేడు స్కూల్ఫైనల్ పబ్లిక్ పరీక్షలో తప్పి 1958 మార్చిలో పరీక్షకువెళ్ళే విద్యార్థులు విధిగా చదవవలసిన పాఠ్యాంశాల నుంచి హిందీని మినహాయించవలసినదిగా ప్రభుత్వానికి పశ్చిమ గోదావరి జిల్లా ఉన్నతపాఠశాలల ప్రధానోపాధ్యాయులసభ విజ్ఞప్తిచేసింది. సభకు శ్రీ వి. అప్పయ్యఅధ్యక్షతవహించారు.

సెకండరీ పాఠశాలలకు ప్రభుత్వం ధనసహాయమిచ్చే ప్రాతిపదికపై 1957 జూన్ 19న ఇచ్చిన ఉత్తరువు పాఠశాలలకు నష్టదాయకమని వివరించారు. పూర్వపు పద్ధతిప్రకారమే ధనసహాయమిప్పించవలసినదిగా ప్రభుత్వాన్ని కోరారు.

### బీహార్ గవర్నర్గా జకీర్ హుస్సేన్ ప్రమాణం

పాట్నా, జూలై 6: బీహార్ రాష్ట్ర గవర్నరుగా ఈరోజుఉదయం డాక్టర్ జకీర్ హుస్సేన్ప్రమాణం స్వీకరించారు. పాట్నా హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ వి. రామస్వామి హిందీలో ప్రమాణం చేయించారు.

ముఖ్యమంత్రి శ్రీ కృష్ణ సిన్హా, ఇతర మంత్రులు, న్యాయమూర్తులు ఈఉత్సవంలో పాల్గొన్నారు.

ఇంతవరకూ గవర్నరుగా ఉన్న శ్రీ ఆర్. ఆర్. దివాకర్ అంతకుముందు హుబ్లీకి బయలుదేరి వెళ్లిపోయారు.